సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతి 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 16
23.12-53

విజయ మార్గశీర్ష బహుళ తదియ బుధవారం



జావా - తోలుబొమ్మలు రామాయణగాథ

# విషయానుక్రమణిక

ముఖచిత్రం :— విజయభట్ నిర్మించిన "మహాప్రభు చైతన్య"లో భారత్ భూషణ్.





"తెలివి యొకింత లేనియెడ
దృప్తుడనై కరిభంగి సర్వమున్
తెలిసితినంచు గర్వితమతిన్
విహరించితి దొల్లి; యిప్పుడు
జ్వలమతులైన పండితుల
సన్నిధి నించుక బోధశాలినై
తెలియనివాడనై మెలగితిం
గతమయ్యె నితాంత గర్వమున్."

తా॥ నేను కొంచెముగానైనా తెలియని యప్పుడు నా జ్ఞానమునకు నేను సంతృప్తుడనై సర్వం తెలిసికొన్నాను అనే గర్వ భావముతో ఏనుగువలె విహరించాను. కాని యిప్పుడు మేధానిధులైన పండితుల సన్నిధియందు కొంచెము జ్ఞాన వికాసము కలిగినవాడనగుటవల్ల నాకు తెలియనివి చాలా ఉన్నాయనే గ్రహింపుతో ప్రవర్తించడం ప్రారంభించాను. పూర్వము నన్ను విడువకుండా ఉండిన గర్వమంతా యిప్పుడు నాకు తొలగిపోయింది.

ఒకప్పుడు తనకు అంతా తెలుసుననే గర్వం ఉండేదట. ఇప్పుడు ఆగర్వం తనకు లేదని సగర్వంగా చెప్పుకొనుచున్నాడు. "ఏమండోయ్! నేను గర్వం అనేది లేనటువంటివాడనైనాను" అని తన గొప్ప తానే చెప్పుకొంటున్నాడు. "నేను యిప్పుడు చాలా బుద్ధిమంతుడనైనాను" అని ఎవడైనా తన విషయమై తాను చెప్పుకొన్నట్లయితే, అటువంటివాడు వెర్రివాడంటారా? నిజంగా వివేకి అంటారా? పండితులవద్ద తాను కొంత జ్ఞానోదయం పొందినాను అని కూడా చెప్పుకుంటున్నాడు. మొదటి వాక్యంలో తనకు జ్ఞానోదయం అయిందంటాడు. మరుక్షణంలోనే, రెండో వాక్యంలో "నేను అజ్ఞానినై యున్నాను అనే సంగతి గ్రహించాను" అని అంటాడు. "నేను అజ్ఞానిని అనేజ్ఞానం నాకు కలిగింది." ఈవాక్యం కేవలం తురక తెనుగులాగున ఉంది. "నాకీ జ్ఞానం లేదూ ఉంది" అనేది తురకతెనుగు. (దీనికి సరియైన తెనుగు :—నాకు జ్ఞానంలేకయున్నది) "మాకు జ్ఞానంలేదు" అనే మాటను "హంకో అక్కల్ నహీ హై" అని తురకంలో చెప్పిన దాన్ని తర్జుమా చేస్తే "మాకు జ్ఞానం లేదు ఉంది" అని తెనుగులో చెప్పవలసివస్తుంది. తనకు జ్ఞానం లేదనే గ్రహింపు కలిగినదని పైపద్యంలోని అంతరార్థంగా కన్పిస్తోంది.

ఇటువంటి భావములు చాలా సూక్ష్మమైన భావములు. కేవలం మాటలచమత్కారంగా త్రోసివేయడానికి వీలులేదు. "పేదరికంబున పేదలై, ప్రజలు సుఖంగాఉన్నారు" అనే వాక్యం యిటువంటిదే. పేదరికం అనేది ప్రజలకు లేకపోవుటవల్ల అదికూడా ఒక విధమైన "లేమి" అని నిర్వచించవచ్చు. "లేమి" లేకపోవుట నిజంగా లోకవ్యవహారాన్నిబట్టి లేమి కాదు. కాని, లోకంలో, అందులో ముఖ్యంగా యీ కాలంలో కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారంగా, ప్రపంచంలోని మానవకోటి అంతా రెండు వర్గాలుగానే విభజింప బడుతూ ఉన్నది. (1) ఉన్నవాళ్లు (2) లేనివాళ్లు ((1) *Haves* (2) *Have-nots.*) ఇది ఆర్థిక ప్రపంచలో చేయబడిన విభజన. ఆర్థికంగా ఎటువంటి స్థితి, ఎటువంటి జీవితావసర సౌకర్యములు, ఎటువంటి జరుగుబాట్లు ఉంటే, "ఉన్నవాడు" అనే వర్గంలో చేర్చవచ్చునో ఆయా దేశాకాల పాత్రములనుబట్ట ఆర్థిక వేత్తలు నిర్ణయిస్తారు.

కుటుంబం ఒకటికి అయిదు యకరాల భూమి ఉన్నట్లయితే, అటువంటి కుటుంబాన్ని సరియైన స్థితిగల కుటుంబంగా వర్గీకరించవచ్చునని కొందరు వాదిస్తున్నారు. అంతే కాదు. అటువంటి కుటుంబములోని పిల్లలకు ప్రభుత్వము వారే ఉచితంగా చదువు చెప్పించుటకై విద్యాబోధనా సౌకర్యములు ఏర్పాటు చెయ్యాలి. ఆ కుటుంబంలోని వారికందరికీ, కావలసిన

వైద్యసహాయ సౌకర్యములను కూడా ఉచితంగా ప్రభుత్వమువారే ఏర్పాటు చెయ్యాలి. ఆ కుటుంబంలో నివారికి కావలసిన నాటకవినోదప్రదర్శనములను సినెమా సర్కసు ప్రదర్శనములను యధాశక్తిగా గవర్నమెంటువారే ఉచితంగా ఏర్పాటు చేయవలెను. ఆ కుటుంబంలో నివారికి కాపురం ఉండుటకు యిండ్లు ప్రభుత్వము వారే ఉచితంగా కట్టించి యివ్వవలెను. ఆ యింటికి విద్యుచ్ఛక్తి సప్లయి కూడా గవర్నమెంటువారే చేయవలెను. ఒక్కొక్క ఇంటికి ఒక్కొక్క రేడియో కూడా సప్లయి చేయవలెను. ఇన్ని సౌకర్యాలూ, ఇన్ని జరుగుబాట్లూ ఏర్పాటు చేసిన తర్వాత పై జెప్పిన అయిదు యకరాల ఫలసాయం మీద జీవించే కుటుంబం సరియైన సంసార సౌకర్యము ఉన్నటువంటి కుటుంబంగా జమకట్టవచ్చు. అటువంటి సంసారిని "ఉన్నవాడు" అని వర్గీకరించవచ్చు. అట్టి జీవిత వసతి సౌకర్యం లేనివానిని "లేనివాడు" అని వర్గీకరించవలసి ఉంటుంది.

ఈవిధంగా స్థూలమైన విభజనగాని, వర్గీకరణంగాని చేయవచ్చు. కాని, "ఉన్నవాడు" ఎవడైనా, అంతకంటె, తనకు యిక అక్కరలేదనే మాట అనగలడా? దేశంలో ఉన్నభూమినీ,వస్తుసంపదనూ లేవను లెక్కప్రకారం ప్రజలకు పంచిపెట్టవలసిన అవసరం ఉన్నదని అధికారులు అనవచ్చు. అధికారుల ఆజ్ఞను అడుగుదాటుటకు వీలు లేదని ప్రజలు అణగిమణగియుండవచ్చు. కాని, అవకాశం దొరికితే ఆందలం ఎక్కవలెననే కోరిక అమ్మాయికి గాని, అబ్బాయికి గాని ఉండదంటారా? ఒకసారి సినెమా చూచివచ్చినతర్వాత రెండో సారి చూడవలెననే కోరిక కలుగదా? ఒకరకం చీర కొలది దినాలు కట్టిన తర్వాత, ఇంకో కొత్త ఫ్యాషను చీర కట్టవలెననే కోరిక ఉండదా? ప్రక్క యింటి పిల్లకంటె తా నెక్కువ షోకుగా ఉండాలనే కోరిక లేని బాలిక ఉంటుందా? తనభార్య కోరికనూ,తన కుమార్తెల కుతూహలములనూ సఫలము చేయవలెననే సంకల్పం లేని సంసారి ఉంటాడా? ఉప్పు కారం పులుసు తినేటటువంటి సంసారులు కోరికలులేని నిస్సారులు ఎట్లా అవుతారు? ముత్యాలహారం కొనుక్కోగల్గిన తాహతువస్తే, వజ్రాల హారంమీద ఆశ కలుగక మానదు. సాదా జరీచీరె ఉంటే, సిల్కు జరీచీర కావాలనే కోరికలు మొలకలెత్తక మానవు. సైకి లెక్కినవానికి మోటారుకా రెక్కవలెననే కోరిక కలుగకమానదు. ఈ విధంగా గాలిమేడలు కట్టవలెగా. స్వర్గభోగ్యాలు అనుభవించడంలో ఆశలు అంతకంతకు పైకి పోతూనే ఉంటాయి.

అయిహిక జీవితవసతి సౌకర్యములనేవి మఱ్ఱిచెట్టు విస్తరించినట్లుగా విస్తరిస్తాయి. ఒక్కొక్క ఊడ దిగినప్పుడు అది కేవలం విలాసం, కేవలం భోగం అంటాము. కాని, ఆఊడ నేలలో వేరుపారినప్పుడు, అది మన జీవితంలో వేరుపారిన వృక్షంలాగున స్థిరమైపోయినప్పుడు, దానికొక ప్రత్యేక స్థావరం ఏర్పడి, అదికూడా జీవితావసరం లాగున తయారవుతుంది. మనకు విద్యుచ్ఛక్తి దీపాలు కొత్తగా వచ్చినప్పుడు, అవి భాగ్యవంతులు విలాసార్థంగా తమ యిండ్లకు పెట్టుకొని అనుభవించేటటువంటి భోగం అని భావించాము. కాని ఈ విద్యుచ్ఛక్తి అనేది విరివిగా సప్లయి చేయబడుతూ వచ్చినతర్వాత, విద్యుద్దీపాలూ, విద్యుద్వ్యంజామరలూ ప్రతి యింటికీ ఉండడం పరిపాటిఅయిపోయింది. అందువల్ల ప్రతి యింటికీ విధిగా ఉండవలసిన జీవితావసరంగా పరిణమించక తప్పదు. జీవితానికి కావలసిన కనీసపు సౌకర్యాలలో, ప్రాతిపదిక జీవితావసరాలలో, అదికూడా ఒకటిగా చేరుతుంది. విద్యుచ్ఛక్తి లేక గృహస్థు అయినవాడు సుఖంగా చడం ఎట్లాగు? అనే సమస్య ప్ర ప్రభుత్వానికీ ఏర్పడుతుంది. విద్యు అనేది ప్రతి యింటికీ సప్లయి అవు పరిస్థితిలో, యింటి కొక రేడియో సులభమైన వెలకు సప్లయిచేయగల రే పెట్టెల యంత్రాగారములు వృద్ధియైన తిలో, నిప్పు పెట్టెలూ సిగరెట్లూ, కృత్యావసరములైన విధంగానే, కొక రేడియో పెట్టె ఉండడం ఉత్త తో పాధికి ప్రజావిజ్ఞాన వికాసానికి వసరం అనే భావం, రేడియో ప్రస ద్వారానే, ప్రజలలో వ్యాపిస్తుంది. అది యింట్లో లేనివాడు అధమాధమ అభిప్రాయం ఏర్పడుతుంది. కనుక రే అనే ఊడ కూడా, జీవితావసరం నేలలో వేరు పారి స్థిరమైపోతుంది. విలాసములు ఊడలవలె విస్తరించి,ఆ విలాసములే జీవితావసరములైపోతాం

ఇదంతా ఆర్థిక వ్యవహార ఊహా ఉపసంహారం. వస్తుసంపదను ప్రజలం సమానంగా అనుభవించవలెననేది

# ★ కాలక్షేపం ★

మనదేశంలో నొక్కి వక్కాణింపబడిన రేషనుకార్డుల ఘోష. అందరికీ అది విదితమైన విషయమే. కాని, యీ రేషను కార్డుల ఫ్యాషను కాలంలో అనగా గత సంగ్రామ కాలంలో, "అధికాహారోత్పత్తి" అనే నినాదం కూడా అధికమై, అత్యధికమై, "అధికాహారోత్పత్తి" కంటె "అధికాహార నినాదోత్పత్తి" అధికమైంది. "శంభుని శిరంబు"నుండి ఉత్పత్తియైన గంగాప్రవాహం ఆఖరుకు సముద్రంలో కలిసి, పాతాళలోకంలోనికి వెళ్లి, పాతాళ గంగయైనట్లుగా, పవనాంధో లోకమున్ చేరినట్లుగా, అనేక కోట్ల రూపాయలు వ్యయం చేసిన యీ అధికాహారోత్పత్తి ఉద్యమం కూడా, కూలంకష వలె, గట్లు కోసికొనిపోయెడి హద్దు మేరలేని ప్రవాహంలాగున, వెళ్ళిపోయింది. ఈ అధికాహారోత్పత్తి నినాదం కేంద్రప్రభుత్వాధికారుల ముఖ గహ్వరములందు ఉత్పత్తియై గంగాప్రవాహం లాగున ప్రవహించింది. గంగ వెళ్ళి బంగాళాఖాతంలో (*Bay of Bengal* లో) కలిసింది.

ఎప్పుడైతే వస్తుసంపదను అందరూ పుష్కలంగా సమానంగా అనుభవించవలెనని ప్రభుత్వం కళ్లెం పట్టుతుందో, అప్పుడు యీ వస్తుసంపదయొక్క సప్లయి సరఫరా విషయంలో మాత్రమే గాక, వస్తు ఉత్పత్తివిషయంలోనూ, వస్తునిర్మాణవిషయంలోనూ ప్రభుత్వం కళ్లెం పట్టవలసివస్తుంది. వస్తుసంపద పంపకం విషయంలోనూ పెంపకం విషయంలోనూ ప్రభుత్వం కళ్లెం పట్టవలసివస్తుంది. అంతేకాదు. జనులు వినియోగించే సరకుల పరిమితిని కంట్రోలు చేసినవిధంగానే, జనుల సంఖ్యనుకూడా కంట్రోలు చేయడం ప్రభుత్వానికి అవసరంగా కన్పిస్తుంది. దీనినే ఇంగ్లీషులో యిప్పుడు *Family Planning* (సంసారాలను అనగా కుటుంబములలోని జనసంఖ్యను కంట్రోలు చేయడం) అన్నారు. పంచవర్ష ప్రణాళికలలో యీ విషయాలుకూడా చేరిఉన్నాయి. అధికాహారోత్పత్తికోసం గోదావరికి రామపాదాసాగరం కట్టాలి. కృష్ణకు నందికొండ వగైరా డాములు కట్టాలి. సాగుబడి భూమి విస్తీర్ణం హెచ్చించాలి. అనేక లక్షల టన్నుల ధాన్యం పండించాలి. అనేక లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయాలి. ఆ విద్యుచ్ఛక్తితో అనేక ఫ్యాక్టరీలను నడిపించాలి. చక్కెర, బట్టలు, కాగితాలు పెన్సిళ్ళు, ఎరువులు విరివిగా తయారు చేయాలి. కాని, యివన్నీ అనుభవించి వినియోగించుకొనెడి జనసంఖ్య మితిమీరకుండా సంతానోత్పత్తిని నిగ్రహించాలి. వీలైనంతవరకూ తగ్గించాలి.

అధికాహారోత్పత్తి కావాలి. కాని అధిక సంతానోత్పత్తి కాకూడదు. అనుభవించుటకు అవసరమైన స్వదేశవస్తుసంపదను ఎక్కువగా వృద్ధిచేసి, దానిని అనుభవించే వాళ్ళు తక్కువగా ఉండేటట్లు చూచుకోవాలి.

సంపద అమితంగా ఉండాలి. సంతానం మితంగా ఉండాలి. కుబేర సంపద కావాలి. కుచేల సంతానం కూడదు. దీని అర్థం ఏమిటి? పుట్టేవాళ్లు తక్కువైతే, ఉన్నవాళ్ళు పొట్టనిండా తినవచ్చు.

సంతానం కోరనివానికి సంసారం ఎందుకు? అనే ప్రశ్న అడగవద్దన్నారు. ఎందుచేతనంటే, పెళ్ళి చేసికొన్న తర్వాత సంసారులు బైరాగులు కావడానికి వీలు లేదన్నారు. ప్రకృతిలో స్త్రీలూ పురుషులూ అనే రెండు జాతులుఉన్న తర్వాత ఉభయులూ పెళ్ళిళ్ళు చేసికొనకపోతే అది ప్రకృతికి విరుద్ధం అన్నారు. మానవజాతికి కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలు అనేవి సహజంగా ఉన్నాయి గనుక, స్త్రీలకూ పురుషులకూ పరస్పర కామేచ్ఛ ప్రకృతిసిద్ధంగా ఉంది గనుక, దానిని కంట్రోలు చేయలేమన్నారు. అనుభవించవలెననే ఆశ లోభము—కనుక లోభం కూడా ఉండవలెనని అంగీకరించాలి. అనుభవించనియ్యకపోతే, క్రోధం కూడా సహజంగా కలుగుతుంది. కనుక క్రోధం కూడా సహజంగా ఉండక తప్పదని అంగీకరించాలి. కనుక, యుద్ధాలుకూడా సహజమనే సిద్ధాంతీకరించాలి.

ఈవిధంగా, పై జెప్పిన పంచవర్షప్రణాళికలలో చేరిన మూలికలే యీ కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యములు. మన ఆర్థిక ధర్మశాస్త్ర సూత్రములు యీ రస్తా మీదనే నడుస్తున్నాయి.

ఇటువంటి ఆర్థిక ధర్మసూత్రములమీద వ్యవహార చక్రం సంసారచక్రం నడిపిస్తూ, ప్రజలకందరికీ సమానంగా జీవితావసర సౌకర్యముల నన్నింటినీ పంచిపెట్టడం మూలంగా మానవ జీవిత సమస్యలనూ ప్రపంచ వ్యవహార సమస్యలనూ సులభంగా పరిష్కరించవచ్చుననే సామ్యవాద సిద్ధాంతం చేతబట్టుకొని "నాకు జీవిత రహస్య పరమార్థం అంతా బోధపడింది. లోకశాంతి సూత్రం కరతలామలకం అయింది." అని భావించి, తృప్తుడై కరిభంగి సర్వమున్ దెలిసితినంచు గర్వితమతిన్ విహరించెడి వానికి సర్వజ్ఞత్వమున్నదని నిర్వచించగలమా?

నే నింకా "సత్యాన్వేషణములో సాధనచేస్తూఉన్నాను." అని సవినయంగా సమాధానమిచ్చెడి సత్యాగ్రహిని శిరసావహింపవచ్చునా? గాంధిమహాత్ముడుతనజీవితమంతా సత్యాన్వేషణకై సమర్పించి నప్పటికీ, చిట్టచివరి అవసానదశలోకూడా "నాకింకా అంధకారమయంగానే ఉంది. నాకు దారిజూపగల దివ్యజ్యోతికై పరాత్పరుని ప్రార్థించుచున్నాను." అన్నాడు.

భారతదేశ విభజనానంతరం, పాకిస్తాను పరిస్థితుల పరికించి పరిపరి విధముల తల పోసి విలపించియున్నాడు. పాకిస్తాన్‌లో అమెరికా రాజ్యం ఎట్టి అక్రమం చేయునో ఎట్టి ఆక్రమణ చేయునో ఎవ్వారెరుంగుదురు? ఈశ్వరసంకల్ప మెవ్వారెరుంగుదురు? ఏరీతి ఎట్లుండునో? ఈ భయం, ఈ అజ్ఞానావస్థమనకు ఉండడం అవసరం. ఏదిఎట్లా జరుగునో తెలియని అజ్ఞానావస్థలో ఉన్నామనే గ్రహింపు కలగడమే జ్ఞానం. అదే శుభప్రదమైనది. అటువంటి స్థితిలో, "తెలియనివాడనై మెలగితిన్ గతమయ్యె నితాంత గర్వమున్" అనే మాట చెప్పగల్గినవాడే పండితుడు. పండిత జవహరిలాలు నెహ్రూ ముమ్మాటికీ పండితుడే.

సామ్రాజ్య కాంక్షగల అమెరికా, ఇంగ్లండువంటిరాజ్యాల వర్గముతో ఏకీభవించడం భారతదేశానికి శ్రేయస్కరం కాదు అని ఆయన వాదించినకాలం గడచిపోయింది. బ్రిటిష్‌వారు యిండియాను రెండుగా ఖండించి భారతదేశానికీ పాకిస్తానుకూ స్వరాజ్యం యిచ్చి నిష్క్రమించారు. బ్రిటనుదేశాన్ని ఆశ్రయించిన కామనువెల్తు రాజ్యాలకూటంలో చేరియుండడం భారతదేశానికి భద్రంఅన్నారు నెహ్రూగారు.

పరిషియా రాజ్యములో అమెరికాకూ బ్రిటనుకూ కిరసనాయిలు గనులు భుక్తం కాగూడదని భీష్మించినటువంటి మొసాదిక్ అనే పర్షియా ప్రధాన మంత్రికి అధికారం పోయింది. పలుకుబడి పోయింది. అతని మరణ దండనకై విచారణ జరుగుతోంది. అమెరికాకు సుముఖంగా పరిషియాలో ఉన్న కొత్త ప్రభుత్వ మంత్రి వర్గానికి యిప్పుడు కోట్లకొలది డాలరులను కుమ్మరిస్తోంది అమెరికా.

కాశ్మీరు సంస్థానం భారతదేశంతో సంబంధం లేకుండా స్వతంత్ర

(49-వ పేజీ చూడండి)

రేడియో నాటిక:

# పునరాగమనం

[కోడికూసేవేళ...ఎక్కడో దూరాన అస్పష్టంగా మేలుకొలుపు... క్రమేపీ ప్రశాంత గంభీర వాతావరణం...గుడిగంటలమ్రోత...]

ఓం అసతో మా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ
(అని వినిపించి ఆగిపోతుంది)

[కమల ఇంట్లో]

శాంత: [ఎక్కడినించో నడిచివొచ్చిన ఆయాసంవల్ల వగరుస్తో....బరువుగా నిట్టూరుస్తుంది. సంకోచిస్తో నెమ్మదిగా కమలని మేల్కొలుపుతుంది]
అక్కా...కమలక్కా...

కమల: [పూర్తి మెలకువరాని స్వరంతో] ఊఁ...

శాం: అక్కా! లే కమలక్కా...

క: అబ్బ [ఆవలిస్తూ రాగంతీస్తో]ఎవరే?

శాం: నేనే! శాంతని కమలక్కా...

క: [మామూలు స్వరంతో] నువ్వా శాంతా?

శాం: ఆఁ నేనే...

క: [ఆదుర్దాగా] ఇదేఁవిటే? ఇప్పుడొచ్చావ్?

శాం: వొచ్చేశాను.

క: అంటే?

శాం: అంతే వొచ్చేశానక్కా... [నిట్టూరుస్తుంది]

క: సరిగా చెప్పవే. అతనేడీ?

శాం: వొక్కదాన్నే వొచ్చేశాను.

క: జరిగిందేఁవిటో చెప్పవే?

శాం: మూణ్ణాళ్ళ ముచ్చటయిందక్కా.

క: వొదిలేశాడా?

శాం: ఏ రాయి అయితేనేం, పళ్ళూడిపోయాయ్.

క: హుఁ...సరే బాగానేఉంది...

శాం: నామీద కోపంవొస్తోందాఅక్కా? [బాధతో] నువ్వుకూడా నన్ను...

క: ఛ, పిచ్చిపిల్లా! నీ మీదకోప తాపాలు నాకెందుకుంటయ్ చెప్పమ్మా...? నువ్వెంతో నేనూ అంతే...మనం ఆడవాళ్ళం. [నవ్వి] ఆడవాళ్ళం కనక దేవతలం అవుదామని కలలు కంటాం...నిజానికి ఏమవుతామో తెలీదు...లోకం దృష్టిలో రాక్షసులం అవుతాం. చివరికి మనం ఏమీకాము...ఆడవాళ్ళంగానే మిగిలిపోతాం... అదంతా సరే...అసలేంజరిగిందో చెప్పు...

శాం: ఎక్కణ్ణుంచి చెప్పను?

క: [నవ్వి] ఆ దేవదూత నిన్ని నరకకూపంనించి లాక్కుపోయి నప్పటినించీ చెప్పు, అతను నీకై తెరిచిన స్వర్గస్వర్ణ ద్వారాలు ఎలా తెరుచుకున్నాయో, వినైనా సంతోషిస్తాను...

శాం: నరకం...స్వర్గం...[కసిగా] నరకంలో వొళ్ళుమాత్రమే చెడుతుంది... స్వర్గంలో మనసుకూడా కుళ్ళిపోతుందక్కా ...వేయి నరకాలకు మారుపేరే స్వర్గం...

క: పోనిద్దూ ఏదోవొకటి, మనం ఎందునా పొందని ఉత్త ఆడవాళ్ళమని ఇప్పటికైనా తెలిసొచ్చిందిగా...?

శాం: ఆఁ బాగా!...

## [illegible]

క: మరయితే చెప్పు...నిన్న రాత్రి తీసుకుపోయాడు...ఊఁ తర్వాత?

శాం: అతనిగదికే తీసుకుపోయాడు. దోవపొడుగునా నన్నుద్ధరించడానికి తను ఎలాంటి ఏర్పాట్లు చెయ్యదలుచుకున్నాడో అవన్నీ చెప్పుకొచ్చాడు...

క: ఇంకేం, వింటూంటేనే కలలు వొచ్చి ఉంటాయి నీకు...(నవ్వుతూ) ఎంచక్కటి కలలో!...

శాం: కల వల్లకాదు! అంత చీకట్లో కూడా సిగ్గుతో నా మనసూ, వొళ్ళూ ముడుచుకుపోయాయి...

క: ఐతే అంత చక్కగా ఊరించాడూ నిన్ను? సరే...తర్వాత?

శాం: అతని గదిలో దీపంకూడా లేదు ...ఏదో బల్లచెక్క చూసుకుని దానిమీద పడుకున్నాను. కాని నిద్రపట్టలేదు. మేలుకునే ఉన్నాను...

క: కాస్త ఆగు...అతని పేరు?

శాం: చంద్రం...తర్వాత... ఏంజరిగిందంటే...

*    *    *

[ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వని]
[చంద్రం గదిలో]

చంద్రం: వొరేయి గోపీ...లేవరా మొద్దూ...

గోపీ: అబ్బబ్బబ్బ...ఎవడ్రా -
ల్లాగా...

చం: నేనే చంద్రాన్ని, లేవరా
నోరుమూసుకుని లే...ఆమె వొచ్చిం

గో: లేచాను. ఆమె అంటే ఎవ

చం: అరవకు, ఆమె నిద్రపోలో

గో: చచ్చాం పో, ఆమె రా
నిద్రపోవడం, ఇదంతా ఎప్పుడు? ఆ
పేరన్నా చెప్పు...

చం: శాంత! ఒక నిస్సహాయురా

జీవితంలో చీకటి తప్ప వెలుగు ఎరగదు. సంఘచ్యుతురాలు...

గో : ఈ బిరుదులు చాలవూ? ఇంకెందుకులే...విన్నాం!...

చం : నువ్వు విని తీరాలిరా గోపీ! నీకన్నా ఆప్తులు నాకెవరూ లేరు...ఇంత చదువు చదువుకుని—మనం చేయవలసిన ధర్మం ఏదన్నా ఉందంటే...ఇదే...

గో : ధర్మం కాదు......మనకు పట్టిన కర్మం అను సరిపోతుంది.

చం : ఏమయినాసరే. నా మనసుకి మంచి అని తోచింది. చేశాను...

గో : మంచేమిటి, చెడ్డేమిటి భాయ్... మనసు చెబుతుంది, మనం చేస్తాం. మనం చేస్తాం, మనసు సంతోషం పొందుతుంది. అది చెల్లుతుంది. అంతే...సరే కాని—

చం : కానీ గీనీ లేదు. నాకున్న సర్వస్వం వెచ్చించి అయినాసరే ఆమెని తిరిగి సంఘంలో గౌరవప్రదంగా జీవించే మనిషిగా, తయారుచేస్తాను...

గో : తప్పక చెయ్...చచ్చిన నీ పితృదేవతలు సంతోషిస్తారు...బస్...అంటే ఆవిణ్ణి నువ్వు పెళ్ళాడతావా?

చం: ఛ అదేం మాటరా? ఆవిణ్ణి యోగ్యురాలిని చేశాక, ఆవిడ ఇష్టం వొచ్చినవాణ్ణి పెళ్ళాడుతుంది. అదంతా వేరే సమస్య.

గో : అయితే మరెందుకు తీసుకొచ్చినట్టు?

చం : నోర్ముయ్‌రా. ఆవిణ్ణి ఉద్ధరించాలని, ఆ నీచ జీవితంలోంచి; నరకంలోంచి తీసుకొచ్చాను.

గో : వేశ్యకి జీసస్ ముక్తి ఇచ్చినట్లు..

చం : ఈమాత్రందానికి జీసస్‌తో పోల్చుకోడం అనవసరం...ఏమిటి మరి? నీ విషయం చెప్పు...

గో: నన్నింకో గదిచూసుకోమంటావా?

చం : మళ్ళా అదేం గొడవ...నువ్వూ నేనెంతో ఆమెకూడా అంతే, నువ్వీ గదిలోనే ఉండి తీరాలి...

గో : ఐతే, సమస్యే లేదు. నేనేం చెయ్యాలో చెప్పు.. వంట పెడతావా?.. బజారునుంచి సామాన్లు తెస్తాను. ఆవిణ్ణి చదివిస్తావా? నేనే వంట చేస్తాను...

చం: అవసరమైతే అన్నీ చేసుకుందాం, తప్పేముంది?

గో : ఏం లేదు, ముందు డబ్బెంత నిల్వ ఉందో చూడాలి.

చం : వెయ్యిరూపాయిలున్నాయి. ఈలోగా ఏదన్నా ఉద్యోగం చూస్తాను..

గో : కోర్సు పూర్తిచెయ్యవా?

చం : చదివింది చాలు...ఇక, జీవితమే ఒక చదువు...

గో : ఇదెక్కడి యోగంరా సుమా...

చం : నోర్ముయ్‌రా శిష్యా ..

[పని మనిషి తలుపుకొడుతూ 'బాబుగారూ' అని పిలుస్తుంది.]

గో : వచ్చాంరా బాబూ, ఈవిణ్ణి పని మనిషి చూస్తే?

చం : ఏం చూస్తే? మన చెల్లెళ్ళు మన గదుల్లో వుంటే ఏంతప్పు?

గో : సరే, తలుపు తీస్తాను.

అప్పలమ్మ : తెల్లకు తెల్లారినా తలుపు తీయకపోతే ఎట్టా బాబూ...నాలుగిళ్ళల్లో పాచిపని చెయ్యాలి...

గో : అప్పలమ్మా, రేపటినించి పాచిపనే కాదు, అంట్లుకూడా తోమాలి.

అప్ప : వండెడతారేటి బాబు? ఆవిడెవరు బాబూ?

చం : మా చుట్టం అప్పలమ్మా. చప్పుడు చెయ్యకుండా ఊడ్చిపో...

అప్ప : అట్టాగే...ఎంత చుట్టమయినా, తెల్లారినా లేవకుండా పడుకున్నారేటి బాబూ.

చం : ఊఁ నీకెందుకా గొడవ? రాత్రంతా రైల్లో ప్రయాణం చేసి వొచ్చారులే...

అప్ప : సరే బాబూ...మా దొరసానా బాబూ!...

గో : అప్పలమ్మా, నోర్మూసుకుని ఊడ్చెయ్...

అప్ప : అట్టాగే బాబూ...

చం : గోపీ, నువ్వు బజారుకు వెళ్ళిరావాలిరా?

గో: ఎందుకు? వంట రేపటినించి కదా...ఈరోజు హోటల్‌నించి తెప్పిద్దాం.

చం: కాస్త కాఫీ ఫలహారాలు వదూ: మొద్దు అన్నీ చెప్పాలి...

అప్ప: వెళుతున్నాను బాబూగారూ! రేపట్నించి అంట్లుతోమిపోతాను...(అప్పలమ్మ వెళుతుంది)

గో: రైటో...వెళ్ళు. సరే చంద్రం! డబ్బులు పారేయ్, వెళ్లొస్తా...

చం: నీ మొహం, ఫాస్కా తీసుకో....

(గోపీ వెళతాడు)

గో: సారీ...అలాగే ..

చం: శాంతా శాంతా...

శాం: (బద్ధకంగా లేసున్నట్టు) అబ్బ! నిద్దేపట్టలేదు. లేపేస్తున్నారు.

చం: తెల్లారేసరికి లేవడం అలవాటు చేసుకోవాలి శాంతా...

శాం: ఏమోబాబూ... పగలల్లా నిద్రపోవడం ఇన్నాళ్ళూ అలవాటు. సరే అలాగే పొద్దున్నే లేస్తాను. సరేనా?

చం: బావుంది. ఈ గదిలో మనం ముగ్గురం ఉందాం వంట మనమే చేసుకుందాం.

శాం: వంటా? నాకదేమిటో తెలీదు. వంటచెయ్యవలసిన అవసరం నాకెన్నడూ రాలేదు.

చం: ఆ పాత జీవితంలోని అలవాట్లన్నీ మరి మారిపోవాలి. నువ్విప్పుడు నాగరికతలోకి, సంఘంలోకి వస్తున్నావు.

శాం: అంటే, నాకర్థం అయితేనా?

చం: తప్పకుండా అర్థం అవుతుంది. నాలుగురోజులు గడిచేసరికి, అన్నీ నీకే తెలుస్తాయి.

శాం: అలాగే. మీరు చెప్పినట్టు చేస్తాను.

చం: పత్రికలూ, పుస్తకాలూ విరివిగా చదవాలి.

శాం: చదవడమా? బొత్తిగా గిట్టనిపని. సినీమాలు చూస్తాను (నవ్వుతుంది)

చం: చూడొచ్చు కాని, నీకు చదువు సరిగా రాకపోతే, ఇక్కడ సంఘంలో మెలగడం కష్టమవుతుంది.

శాం: సంఘం ఏమిటి? నన్ను తెచ్చిన మీరు ఉన్నారు. అంతేచాలు నాకు.

చం : అలా వీల్లేదు. సంఘంనించి మీరు ఎందుకు దూరమైపోయి, ఆ అవినీతి జీవనంలో ఎలా నిస్సహాయులై నశిస్తున్నారో, ...నువ్వు సంఘానికి చూపించాలి. విద్యా, గౌరవాలవల్ల నూతనమార్గాన్ని సాధించాలి.

శాంత : ఏవేవో పెద్ద విషయాలు చెబుతున్నారు. నాలాంటిదాన్ని ఎందుకిలా బాగుచేయాలని ప్రయత్నించడం...పోనీ, నన్ను తిరిగి పంపించరాదూ?

చం : శాంతా మళ్ళా ఆ చీకటివేపు, ఆ

అవినీతి, మృత్యువు వేపు చూడకు నీకోసం నా జీవితాన్ని అర్పించదలచుకున్నాను...

శాంత. (గద్గదికంగా) సరే ఐతే ఇలా రండి ..

చం. నన్ను ముట్టుకోకు మనం ..

శాం: ఇలా నాపక్కనే కూచోండి. మనం ఎవరమైతేనేం, ఒకరికొకరం కావలసిన వాళ్ళం

చం నిజమే, కాదనను. వేరే భావించకు నేను నీ విషయంలో చాలా ఆలోచిస్తున్నాను.

శాం (కిలకిల నవ్వి) అందుకే ఇలా వచ్చికూచోండి నేను మిమ్మల్ని పూర్తిగా నమ్మాను.. మీరు నాకోసం ఎలా జీవితాన్ని అర్పించారో, అలాగే నేనూను రండి

చం: శాంతా! ఉండు, నీపట్ల నాకెలాంటి ఉద్దేశ్యం లేదు.

శాం. (నవ్వి) అంటే?

చం. నువు నవ్వకు, నా కదోలా ఉంటుంది

శాం: ఐతే, మరి నన్నెందుకు తీసుకొచ్చినట్టు?

చం: అదేం ప్రశ్న శాంతా? నిన్ను సంఘంలో గౌరవం పొందగల స్త్రీగా తయారు చేయడానికి సర్వవిషయాలు అనుభవమయ్యాక, నువు నీ ఇష్టంవొచ్చిన వారినెవరినైనా సరే పెళ్ళాడి, కుటుంబీకురాలివి కావాలి...

శాం: బావుంది (నవ్వి) పిల్లల్ని కనాలా?

చం: తప్పకుండా మాతృమూర్తివి కావాలి.

శాం: అయితే, మీరే నన్ను పెళ్లాడండి..

చం: తొందరపడకు.. ఇంకా కొన్నాళ్లు పోనివ్వు...

శాం: ఎందుకూ? మీకూ నాకూ మధ్య ఇంక సందేహం ఏముంది?

చం: ఏమీ లేదు, కాని నాకా ఉద్దేశ్యం ఇప్పుడు లేదు.

శాం: మరయితే, రాత్రి అక్కడి కెందుకొచ్చారు? దెబ్బ నుంచి ఆపడం దానికా?

చం: అది వేరు. ఇప్పుడు నీవూ నేనూ సాధించవలసినది పూర్తిమార్పు. నిన్ను తిరిగి పునరుజ్జీవింప చేస్తానని వాగ్దానం ఇచ్చాను.

శాం: అందుకే నన్ను దూరంగా పెట్టకండి. దగ్గరగా ఉంటేనే మీలో ఐక్యమైపోతాను. రండి.

చం: (ఊపిరి బిగబట్టి) శాంతా!... శాంతా!......



"బావుంది ఈగదిలో మనం ముగ్గురం ఉందాం, వంట మనమే చేసుకుందా
"వంటా? నాకదేమిటో తెలీదు. వంట చెయ్యవలసిన అవసరమూ లేద

శాం: నా దేవతలు మీరు, అందుకే... అందుకే.

[ఫ్లాష్ బాక్ ముగిసిన సూచన ధ్వనులు]
(కమల ఇంట్లో)

కమల: సరే, కథ ఇలా నడిచిందన్న మాట... నువు తొందరపడ్డావా?

శాంత: అదేమిటక్కా, నువ్వు అలా అనుకుంటున్నావు? ఆ పరిస్థితుల్లో నాకంతే తెలిసింది...

క: తర్వాత?

శాం: మరెన్నడూ అలా జరక్కూడదని నన్ను హెచ్చరించాడు. అలా జరిగినందుకు సిగ్గుపడ్డాను......తర్వాత, వంటాగింటా ప్రారంభమయింది. అంతా నాకు కొత్త...

క: అతను మళ్ళా...

శాం: అవును పగలంతా నిగ్రహిం కున్నా, రాత్రిళ్ళు మాయమ్మ నిగ్ర సాధ్యం కాలేదు. కాని, అతను అది స్వంగానే ఉంచాలని అనుకున్నాడు.

క: అదే, అనర్థాలకి మూలం. న అతని స్నేహితులో...

శాం: అసంతా నో పెద్ద తమాషా. గుర్లో తిరగాలనీ, అందరితో కలిసి తినా చెప్పాడు. ఎంత వద్దని చెప్పినా వినలేద

క: అందరికీ నువ్వు...

శాం: నేనో నిరాశ్రయురాలిననీ, న చదువుసంధ్యలు చెప్పించి స్త్రీ ఎలా బతకాలనో బుజువు చేస్తాననీ చెప్పేవా

## ★ [illegible] ★

(9-వ పేజీ తరువాయి)

క: వంటతోనే ఆగిందా నీకు చదువు?

శాం: కాదు. నాకు చదువు చెప్పడానికి ఒక మాస్టారుని పెట్టాడు. రెణ్ణెల్లలో చాలా కష్టపడి నేర్చుకున్నాను. రోజు రోజుకీ – చంద్రంపట్ల నా హృదయం మాత్తుకుపోయింది...

క: ఊఁ, ప్రేమించానంటావ్?

శాం: నిజమంటే. నా జీవితంలో ఎందరితో పరిచయమున్నా ఉత్తయంత్రాన్నే. కాని, అతని అమాయకత్వం, నిర్మల హృదయం నన్ను కదిలించాయ్. పాతజీవిత స్మృతుల్ని నాలోంచి దూరం చేశాను. అతనే నా సర్వస్వమని భావించాను.

క: పతివ్రత వయ్యావన్న మాట?

శాం: అక్కా! దరిద్రం, అజ్ఞానంవల్ల అయ్యిందే ఆపది - డబ్బువల్లా, మగవారివల్లా మారిపోతే, అది నేరమా? కాదు, అంచేత నేను మనసారా ప్రేమించాను. అతనికి ద్రోహం చెయ్యలేను...అది చాలదా... నా గత జీవితాన్ని తుడిచేందుకు?

క: ఊఁ! ఇంకా నీకు ఆ జీవితంలోని మాయ తొలగలేదు...సరే, తర్వాత కథ?

శాం: నాకు చదువు చెప్పే మాస్టారు అతని స్నేహితుడే కాని—

క: నిన్నేం వలచాడా?

శాం: సాహసించలేకపోయాడు. నా ప్రత్యూషంలో చంద్రం జీవిస్తున్నంత కాలం, నన్నెవరూ భ్రమపెటలేరు. ఒకరోజున, ఆరోజే, నా దురదృష్టానికి నాంది. ఆరోజున నేను మామూలుగా చదువుతున్నాను.

[ఫ్లాష్ బాక్ ని సూచించే ధ్వనులు]

[చంద్రం గదిలో]

మాస్టా: శాంతా...

శాంత: ఏఁవిటండీ మాస్టరుగారూ?

మా: అబ్బెబ్బె ఏం లేదు.... నా కేఁవిటో అదోలాగ ఉంది.

శాం: అదోలాగ అంటే...

మా: నిన్ను చూస్తున్నానుకదూ?

శాం: నన్ను చూస్తే...(నవ్వి) వికారంగా ఉందా?

మా: అవును శాంతా...

శాం: ముందు చెయ్యితీసి మాటాడండి.

మాస్టా: అంటే, నా భావం అర్థం కాలేదా?

శాం: అర్థం కానంత చిన్నపిల్లని కాను.

మాస్టా: మరెందుకు సంశయం?

శాం: మీరు నాకు చదువుచెప్పిన గురువులు. అందుకు మిమ్మల్ని ఈ పరిస్థితుల్లో క్షమించగలిగాను. నేను చంద్రం గారి...

మాస్టా: చంద్రం గారి ప్రియురాలివి. అయితే నేం, నీకు ఇటువంటిది కొత్త కాదుగా...

శాం: (నవ్వి) మనిషి మారిపోవచ్చనే సత్యంకూడా గమనించని అజ్ఞానంలో ఉన్నారేమండీ మేస్టారూ?

మాస్టా: నీ ఇష్టంవచ్చినట్టు అను... కాని, నాకోరిక తీర్చు నువ్వేం సతీ అనసూయవు కావు.

శాం: పోనీ, అనసూయ తల్లినన్నా కావచ్చుగా... మళ్ళా మీరు,...చెయ్యి తీసెయ్యండి...

మాస్టా: పోనీ, ఎప్పుడో చెప్పు...

శాం: అలాంటి ఆశలు మీకు తగవు. నన్ను గురించి ఇకముందెన్నడూ పొరబాటు అభిప్రాయానికి రాకండి.

మాస్టా: లోకం కళ్ళు మూస్తావా శాంతా ...ఇన్నాళ్ళూ నేను నిన్ను కోరలేదు. ఇప్పుడు నేను కోరుతున్నాను. ఇది నీకు చేసబైన విషయం ఏమీ కాదు. పోనీ డబ్బు కావాలా?

శాం: మీరింక ఈ విషయం కట్టిపెడితే సంతోషిస్తాను.

[తలుపు తడుతూ చంద్రం 'శాంతా శాంతా' అని పిలుస్తాడు.]

శాం: ఆయన వొచ్చారు. మీ రిలాంటి ప్రస్తావన మరిచిపోండి, మామూలుగా ఉందాం...

చం: ఇదేమిటి? ఇద్దరూ చదువుతున్నట్టు లేరు...

మాస్టా: ఏం లేదోయ్ చంద్రం, రేపటినించి నేను వచ్చి శాంతకి చదువు చెప్పడం కుదరదు.

చం: అదేమిటి? కనీసం కోర్సు పూర్తి కానివ్...

మాస్టా: వీల్లేదు...నాకు వేరే పనులు తగిలాయ్...వస్తానోయ్...

చం: అదేమిటి శాంతా...ఏమన్నా జరిగిందా?

శాం: అబ్బే ఏం లేదండి...

చం: ఏం లేదా? సరే...ఏం లేందే ఎందుకు రానంటాడు?

శాం: ఆయన రాకపోతే మరో మేస్టారుని చూద్దాం...

చం: సరే...

శాం: అన్నట్టు...అడుగుదామని మరిచేపోయాను. కుట్టుమిషనుసంగతి యేం చేశారు...?

చం: ఎందుకదీ...? చెబితే వినవూ...?

శాం: మీరలా మూతిబిగిస్తే నేను భరించలేను. చూడండి...మీవద్ద డబ్బుకూడా అయిపోతోంది. ఇపుడే మిషన్ కొంటే— నేనూ నాలుగురాళ్లు సంపాదిస్తాగా.

చం: సంపాదన! యేంతొందర... మొన్న మొన్నటిదాకా సంపాదనేగా...

శాం: మీరు అపార్థం తీస్తున్నారు. డబ్బు చిక్కు మీకైనా, నాకైనా వొకటేగా? అందుకని, చేతిలోవున్న నాలుగు డబ్బులూ అయిపోకముందే- నేను మిషన్ కుడతాను.

చం: వొద్దులే. ముందు, నువ్వు చక్కని అల్లికపనులు నేర్చుకో, సంగీతం నేర్చుకో. అంతేగాని, మిషన్ కుట్టడమేంటి? ఉత్తి నాన్సెన్స్.

శాం: మీ ఇష్టం అల్లికపనులూ, యివన్నీ మనకెందుకు చెప్పండి...?

చం: అదుగో మళ్ళా మొదలు. నీలో మార్పు రావాలంటే—నువ్వూ సంఘంలోని పెద్దల్లాగానే తయారవాలి. ఆ నాగరికత నేర్చుకోవాలి. డాక్టర్ రుద్రమాంబని చూశావ్ గా, వాళ్లంతా యెలావున్నారు.? అలా తయారవాలి.

శాం: ఊఁ...సరే. మంచి పోలికే తెచ్చారు. వాళ్లంపరిసంగతి మీ కన్నా, నాకే యెక్కువ తెలుసు.

చం: అంటే...?

శాం: పోనిద్దురూ... ఆడవాళ్లం— నాలాంటివాళ్ళకి వాళ్ల లోతుపాతులు తెలుస్తయ్. మగవాళ్లు మీకు తెలివు. పోనీండి. గొప్పే యిడి...?

చం: ఎల్లుండి మన యింట్లో టీపార్టీ పెట్టాను. గోపీ అందర్నీ పిలవడానికి వెళ్లాడు. అందరూ వస్తారు. ఆవేళతో— నీకు యీ తెరచాటుపద్ధతి స్వస్తి.

శాం: ఎందుకిలాటివన్నీ తలపెడతారు.?

చం: శాంతా! నీకు తెలీదు. నిన్ను నాగరికురాల్ని చేసే బాధ్యత నాది.

[ఫ్లాష్ బాక్ ముగిసిన సూచన ధ్వనులు.]

[కమల ఇంట్లో]

క: సరే...మాస్టారు కన్నెశాడు. చంద్రం అనుమానించాడు. రామాయణంలో పిడకలవేట ప్రారంభమయిందన్న మాట.

శాం: అవునక్కా. ఎంత చెప్పినా ఆయన వినలేదు. టీ పార్టీ పెట్టి తీరాలన్నాడు. ఏంచెయ్యను? నా జీవితంలో మళ్ళా యేదో ఉపద్రవంవచ్చి పడుతుందనే అనుమానం వెంటాడింది.

క: టీపార్టీ చేస్తేయేం కలిసొస్తుందని...?

శాం: నాకు పవిత్రత కలుగుతుందట

నేనూ సంఘంలో స్థానం సంపాయించగల నుట.

క: సరే—టీపార్టీ జరిగింది. ఆతర్వాత..

శాం: టీపార్టీ ఊరికే జరగలేదు. అక్కడే ఒక ఆడదాన్ని నాగరిక సంఘం చిత్రవధ చేసింది. అది టీపార్టీ కాదు, నా జీవితంమీద నాగరికులు మోపిన నేరారోపణ.

క: అలాగా టీపార్టీలో నే?

శాం: అవును టీపార్టీ అవుతూండగానే-

[ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వనులు]

[చంద్రం గదివద్ద]

ఒకరు: ఒరేయ్ అబ్బాయి, యీ పిట్ట యెక్కడిదిరా...?

రెండు: ఎక్కడిదోమరి? చంద్రంవలలో పడింది.

మూడు: ఓస్! దీనిసంగతే తెలీదా? పేరు శాంత. మొగంయెరిగిన మనిషే.

రెం: అలా చెప్పు. మెరకవీధి లలన అంటావ్...?

ఒ: వాడు వాగడానికేం లే.

మూ: అయితే, అబద్ధం చెప్పానంటావ్...? ఇప్పుడే తేలుస్తాను. వొరేయ్ గోపీ...

గోపీ: (దూరంనుంచి) ఆఁ... వొస్తున్నా...

రెం: కథ చాలా వుందే...?

మూ: గోపీ...ఆమె యెవర్రా...? మన వాడి రూంలో ఉంది...?

గో: మీకింకా తెలియదా? అయితే, చంద్రం చెప్పలేదూ?...

మూడు: మెరకవీధి భామకి - చంద్రం చెప్పే దేఁవిటోయి?...నీకు తెలిస్తే నువు చెప్పరాదూ?...

గో: మీరందరూ అతనికి స్నేహితులై ఉండీ - యిలాగ మాటాడడం సబబుగా లేదు.

ఒకరు: అవును మరి. భోగందాన్ని తెచ్చి యింట్లో పెడితే, అది సబబు, అదేఁవిటి, దాని కథాకమామీష్ యేమిటంటే - అది బేసబబు. ఇంతకీ నీకూ...

రెండు: ముసుగులో గుద్దులాట ఎందుకు? చంద్రాన్ని పిలిచే అడగండి.

మూడు: వొరేయి, చంద్రం...... చంద్రం...

[దూరాన్నుంచి]

చంద్రం: రా, శాంతా! నా మిత్రులతో మాటాడదాం.

శాంత: వొద్దు. నన్నెరిగినవాళ్ళు ఉంటారు. వాళ్ళందరి యెదటికి నేను రాలేను. మీరు నాకు కొత్త జీవితాన్ని యిచ్చారు. నాకదే చాలు. ఈ నాగరికతలూ మర్యాదలూ వొద్దు. మీరు చాలు నాకు.

చం: అబ్బా! నన్ను చంపకు. రా.

శాం: వొద్దు. వాళ్లు యెగతాళిగా, మర్మంగా అంటే - యెంతో బాధపడాలి. వొద్దు.

[చంద్రం, చంద్రం అని పిలుపులు.]

చం: తప్పకుండా రావలసిందే.

శాం: తప్పదా...?

చం: తప్పదు. పద...

*　　*　　*

ఒకరు: పిట్ట కుదిరుట్టంగా బాగానే ఉందోయ్.

రెండు: తమాయించు. తన్నేయకు మరి.

మూడు: నోరుమ్మయ్యండిరా. రావోయ్ చంద్రం. వారెవరు...ఓహో...శాంత...

చం: అవును. ఆమె పేరు శాంత. ఆమె పతిత. అందుకు బాధ్యత సంఘానిదే. పంకంలోనించి పద్మం పుడుతుంది. అవినీతి జీవనంనించి కూడా నూతనజీవనం ఉద్భవిస్తుంది. అందుకు తార్కాణం శాంత. ఆమెని ఉన్నతస్థితికి తేవాలని ప్రయత్నిస్తున్నా. అందుకు నాకు మీ అందరి సహాయం కావాలి.

మూడు: భేషుగ్గా! తప్పకుండా!

చం: సంతోషం. శాంత యిప్పుడు చదువుతోంది.

ఒకరు: చదువు పూర్తయితేకాని పెళ్ళి చేసుకోవా...?

చం: (తటపటాయించి - భయపడి) ఆ ప్రశ్న లేదు. ఇప్పుడు కేవలం, ఆమె అభివృద్ధికోసమే ప్రయత్నిస్తున్నాను.

రెండు: అదీ మంచిదేలే. నీ సాహసం మెచ్చతగింది. కాలమాన పరిస్థితులు బాగుంటే నువ్వో నాయకుడివి కావచ్చు.

చం: మళ్ళా వస్తాం. అవతల యింకా మిత్రుల్ని పలకరించాలి, వొస్తా...

మూడు: చూశార్రా...మనవాడి వెర్రి!

ఒకరు: ఇంకా రెండురోజులుంటుంది వెర్రి. అంతే.

రెండు: ఒరేయ్, నిన్ను గుర్తుపట్టిందిరా.

మూడు: (వికటంగా నవ్వి) వొరేయి, ఆడదానికళ్ళు చేపకళ్ళతో పోల్చార్రా పెద్దలు. మరిచిపోవడం కలలో వార్త. పోదాం పదండిరా! మాస్టారొస్తున్నారోయ్...

మాస్టా: లేస్తున్నారేం...?

మూడు: ఏం మాస్టారూ...? ఆలస్యమయింది...? శిష్యురాలిని యేకొర్సు చదివిస్తున్నారు...?

మాస్టా: నేను చాలించుకున్నాను.

రెండు: ఏం యెంచేత...?

మాస్టా: కుక్కతోక వంకరతీయడం యెలాంటిదో - ఇలాంటివాళ్ల మనస్సు మార్చటం అలాంటిదే.

మూడు: అదా సంగతి. మాస్టారు మీరు ప్రవరాఖ్యులు కనక తప్పించు న్నారు.

మాస్టా: అంతేనోయ్ - అంతే.

ఒకరు: అయితే, నాకు సందేహ వచ్చింది...

మాస్టా: వొరేయ్, నోరుమ్మయ్యండి. మాటలు వింటల్లేవుంది శాంత.

ఒకరు: ముందు లేచిపదండి. బయ మాటాడుకుందాం.

[ఫ్లాష్‌బాక్ ముగిసిన ధ్వనులు]

[కమల ఇంట్లో]

కమల: ఆ దరిద్రపుమాటలు నువ్వే చంద్రంకూడా విన్నాడా...?

శాం: ఆఁ... విన్నాడు. దాంతో క్షయరోగి రోజురోజుకి చిక్కినట్టు, మానాలతో అతను బాధపడ్డాడు. రాను అతని చేతిలో డబ్బు అయిపోయి ఉద్యోగ ప్రయత్నాలు సాగలేదు.

కమ: వాటికితోడు నీమీద అనుమాన కూడా పెరిగాయా...?

శాం: ఎందుకు పెరగవు? అతని స్నేహి లంతా తరుచు వొచ్చేవాళ్లు. ఏవేవో వ వాళ్లు. వాళ్ళని రానివ్వద్దని చెప్పాను. లేదు. నేనుమాత్రం యేం చెయ్యను...

కమ: అదే నాగరికతలో వున్న రహస్య

శాం: నా మనసు పదేపదే గాయప ఒంటరిగా యేడ్చేదాన్ని. తిరిగి పారిపో మనుకునేదాన్ని. కాని, అతన్ని వ యెలా జీవించగలను?...అని అనుకు దాన్ని. ఎన్ని కష్టాలయినా ఓర్చి అ తోనే జీవించుదామనుకున్నాను. కా యెన్నాళ్లు ఆ యమయాతన భరించడం చివరకి నిన్నరాత్రి...

క: యేంజరిగింది...? కొట్టాడా...

శాం: కొట్టడం యిదివరకే జరిగి కాని రాత్రి ... అతను తాగి కూ వొచ్చాడు.

[ఫ్లాష్‌బాక్ సూచించే ధ్వనులు]

[చంద్రం గదిలో]

చం: ఏయ్...శాంతా

శాం: ఆఁ...

చం: మాస్టారు వొచ్చాడా...?

శాం: ఎందుకొస్తాడు...?

చం: ఎందుకా...? నీకోసం? రాలేదా...?

శాం: ఎందుకలా అంటున్నారు చెప్పరూ...? ఏఁవిటీమాటలు...?

చం: మాటలు కాదు పరమసత్యా

(49-వ పేజీ చూడండి)




## 21

మార్చి నెలాఖరులో ఒకరోజు ఉదయం జెహాన్ ఫ్రొలో జేబు తడువుకున్నాడు. జేబులో గలగల వినరాలేదు. ఇలా అనుకున్నాడు. "చిల్లిగవ్వకూడా లేదు. కాంత, మద్యం, ద్యూతం కుట్రపన్ని కనకాన్ని హరించి వేస్తున్నాయి."

అతనికి చింత కలిగింది. టోపీ సర్దుకున్నాడు. తడివి మాసుకున్నాడు. ముందు వెనుకలు తారుమారైనాయి. సరిగా పెట్టుకున్నాడు. ఏదో ఆలోచన తట్టింది. అలా నిలబడి ఆలోచించాడు. లాభం లేదనుకున్నాడు. దుస్తులు సరిచేసుకున్నాడు. మళ్ళీ అదే ఆలోచన పొడగట్టింది. "ఇంక లాభం లేదు. అన్న దగ్గరకు వెళ్ళాలి. నన్ను కూర్చోబెట్టి ఉపన్యాసమిస్తాడు. ఇవ్వనీ; చివరికి చేతిలో కాసుపడుతుంది" అనుకున్నాడు. విసురుగా గది దాటి నడిచాడు. పారిస్ వీధులలో చకచక నడక సాగించాడు. అప్పుడప్పుడు ప్రక్కలకు చూస్తున్నాడు. అంగళ్ళలో, హోటళ్ళలో తినుబండారాలు నోరూరిస్తున్నాయి. నిట్టూర్పు విడిచి వేగంగా నడిచాడు.

నాటర్ డామ్ చర్చి ప్రాంగణంలోకి వచ్చి నిలబడ్డాడు. క్షణంసేపు చర్చి గోపురాలవంక చూశాడు. మొదట సందేహించాడు. కొంతసేపు అక్కడే అటూ ఇటూ పచారు తిరిగాడు. "కూర్చోబెట్టి పాఠం చెప్తాడు. ఇంతేకదా! కానీ" అనుకున్నాడు చివరికి. ఒక పరిచారకుడు కనిపించాడు. "అన్న ఎక్కడున్నాడు?" అని అడిగాడు.

"ఆయన రహస్యమందిరంలో. మహారాజు కబురంపినా కదిలిరా రిప్పుడు. అక్కడికి వెళ్ళకండి."

"ఆ! ఆ రహస్యమందిరంలో ఏముందో చూడ అన్నాడు, చిటిక వేసి.

లోనికి ప్రవేశించి గోపురం మెట్లెక్కాడు. "గ మంటలవెలుగు కనపడుతుందంటారు; తంత్రప్రయోగాలు న్నాడంటారు. ఇంతా చేస్తే ఆమ్లెట్ వేయించుకుంటు డేమో!"

గదితలుపు తాళం తీసివుంది. మెల్లిగా తలుపు గంట చప్పుడు లేకుండా తెరుచుకుంది. గదిలోకి తొంగిచూశ అంధకారకూపంలా వుంది. గదిమధ్యలో పెద్ద మేజా ఒకటు ప్రక్కన కుర్చీ. మేజాపైన రసాయన శాస్త్రపరిశోధన కుపక సీసాలు, ఆర్పిన స్పిరిట్ దీపాలున్నాయి. గదిపైకప్పునుంచి వుల అస్థిపంజరాలు కొన్ని వేలాడుతున్నాయి. నేలపై చెద టుగా రంగురంగుల ద్రావకాలున్న గాజుపాత్రలున్నాయి. చిన పెద్ద పెద్ద గ్రంథాల పైపుట లెగురకుండా కపాలాలు, ఎమ ఒత్తుపెట్టి ఉన్నాయి. అన్నిటినిండా దుమ్ము పేరుకుని ఉంది. అంతా సాలెగూళ్ళు, బూజుతో నిండిఉంది. కుర్చీలో కూరు వ్యక్తి మేజాపైకి వొంగి ఏదో చూస్తున్నాడు. జెహాన్‌కి అతని మాత్రం కనబడినా, అన్నను గుర్తించాడు.

తలుపు తెరిచిన సద్దు వినపడలేదు. క్లాడ్ ఫ్రొలో తః రాక గమనించలేదు. జెహాన్ కొంతసేపు గది నలుమూలలా క చూశాడు. కుర్చీకి ఎడమప్రక్క కిటికీకి దిగువగా కొలిమి కనపడింది. కొలిమిపైన రకరకాల పాత్రలున్నాయి, కాని ఆరిపోయింది. ప్రమాదకరమైన ద్రవ్యాలతో పనిచెయ్యవలసి ముఖాచ్ఛాదనకు పనికివచ్చే గాజుఫలకం గోడ కొకమూల ద

(52-వ పేజీ చూడండి)

మూలం :
విక్టర్ హ్యూగో

అనువాదం :
సూరంపూడి సీతారామ్

# అంతరంగంతో తరంగాలు

అతనెంతో అంత ఉత్సాహంతో వస్తూన్నాడింటికి. అతనెప్పుడూ అంతే. అతి తేలిగ్గా సంతృప్తిపడతాడు. ఆవేళ యెంతోమందిని కలుసుకున్నాడు. ఎంతోమంది అతనితో పరిచయానికి ఆత్రుత చూపించేరు. తనలోని ప్రత్యేకతను ప్రతి ఒక్కరూ గుర్తించేరు. తన మంచిని యెంచిన మనిషితో మాట్లాడుతూ కాలం గడపటం అతనికెంతో అంత యిష్టం. పరుల కుపకరించగలుగుతున్నానన్న సంతోషం అతన్ని ఆవరిస్తుంది. అలాగని ఆడంబరం లేదు. నిజానికతను భయపడతాడు కూడా; యెక్కడైనా మాటల మధ్యలో అహంభావం పొడగడుతుందేమోనని. అసలు తనలో చిక్కే అది. ఎవరైనా నిర్లక్ష్యం చేస్తున్నారేమో అని అనుమానంతో చూస్తాడు. ఆ సూచన యేపాటి కనిపించినా బిక్కమొహం వేస్తాడు. సమర్థత, సార్థక్యం అన్నవాల గుర్తింపుమీద ఉంటుందని యెందుకు అనుకుంటాడో తెలీదు. శక్తియుక్తులు స్వకీయ సంపదలైనప్పుడు అవి యితరుల ప్రమాణంతో కొలవడంలో సంతృప్తి లోపించవచ్చు. ఇందుకతనెందుకు చింతించాలో తెలీకుండానే ఆరాటపడతాడు. ఎంత సులువుగా నిరాశపడతాడో అంత సులువుగా సంతృప్తి చెందుతాడు.

ఆవేళ అలాగే అయింది. ఆ రోజు అతను అతి ఉత్సాహంగా గడిపేడు. అంతమంది దృష్టి నాకర్షించడంకన్నా అతనెప్పుడూ హెచ్చు ఆశించలేదు. గతిన్ని రోజులు నిండు నిరాశతో గడిపేడో, మరిచిపోయాడు. బహుశా యిది మానవస్వభావమేమో! కాలం ఎదురుతిరుగకుండనే భావం కాలక్రమేణా రద్దవుతుంది కాబోలు. వెలుగులు విరజిమ్మగలిగే కాలపు భవ్యజ్యోతిని జీవిత ప్రాంగణంలో సుస్థిరంగా ప్రతిష్ఠించుకుంటుంది ఆశ. ఆశకు అతీతమైన జీవితం కల. అలాంటి కలలు కంటూనే యింటిముఖం పట్టేడు రామం. యెంతో తేలిగ్గా గాలిని దూసుకుంటూ శరవేగంతో గడపలో కాలు మోపాలని కోరుకున్నాడు.

ఇంటిలో యిల్లాలిని అమందానందంతో కరించేడు. యిల్లంతా నిశ్శబ్దంగా ఉంది.

యిల్లాలి ముఖకవళికల్లో నిగూఢమైన భావాలు గాఢంగా అల్లుకున్నాయి. ఆమె ముఖం ఒక మాదిరిగా దీనంగా ఉంది; యింకోవిధంగా గంభీరముద్ర ధరించింది. యేమైనా ఆమెమాత్రం మితభాషి అయింది. అవసరాలను అనవసరంగా సంభాషణలో పాటించడం జరుగుతుం దప్పుడప్పుడు. ఆరోజు ఆమె అలాటి మాట్లాడలేదు. ఇది రామానికి అట్టే రుచించలేదు. అసలు కంగారుపడ్డాడు మొదట్లో. కొత్తజాగాలో కాలు పెట్టినట్లయింది. అధికారి ముందు మంచికోసం యెంచి పదాలు వాడుతున్నట్టనిపించింది. ఆ వాతావరణంలో యిమిడి ఉన్న యే అజ్ఞాతశక్తో స్వతంత్ర వాయువుల్ని ఉపసంహరించినట్లయింది.

అసలు ఆ రాత్రి సమయంలో అంత ముభావంగా ఉండటం నాగరికతేమో అనుకున్నాడు కూడా. నెమ్మదిగా తన భోజనం పూర్తిచేసేడు. పొదుపుగా మాట్లాడేడు.

పడకగదిలో ప్రవేశించేసరికి మరింత నిశ్శబ్దం ఆవరించినట్లయింది. పిల్ల చక్కగా చిక్కని నిద్రలోనే చిన్నినవ్వు వొదిలింది. యెందుకో ఆవేళ అతను ఆ నవ్వును ఆప్యాయంగా చూడలేకపోయేడు. తన దృష్టి మాత్రం పిల్లమీదకు పోయింది. అనుకోకుండా హఠాత్తుగా నిశ్శబ్దాన్ని ఛేదించేడు. "చూసు సతీ! పిల్ల బాగా ఆడుకుందా."

ఆమెమాత్రం పెద్ద ప్రయత్నంతో జవాబిచ్చింది. పిల్ల ఆడుకోక యేంచేస్తుంది? యెక్కోచ్చి యింట్లో ఉన్న వాళ్ళకే యేమైనా; యిరుగా, పొరుగా? ఉన్నా, అంత కలుపుగోరుతనంగా ఉండరు.

అసలు ఆమెకు తెలీదు, అంతకు మించి యెలా చనువుతీసుకోవాలో. తన జీవితం అనే బాటలో కర్తవ్య నిర్వహణకు అవసరమయే మేరకు ముక్తసరిగా పరులతో ప్రసంగించడం అలవాటైంది ఆమెకు.

ఆవేళ ఆమె ముఖంమాత్రం విచారానికి, నిద్రకు మధ్య యేదో భావాన్ని చూపిస్తోంది. తేలిగ్గా నిద్రపట్టటందుకు వేరొక మానసికావస్థ అవసరం అనుకున్నాడు రామం. ఆప్తవాక్యాలతో ముగించి నిద్రపోవాలనుకున్నాడు. "పిల్ల ఆడుకుంది. సరే; యీవేళ యేమైందో తెలుసా! సతీ! అసలు వాళ్లంతా చాల మంచివాళ్లే. నన్ను కదల్నిచ్చేరు కాదు. ప్రతి మనిషీ స్తోత్రాలు ప్రారంభించేరు..."

"ఓహో అంతటితో అన్నీ మరిచిపోయి అర్ధరాత్రి దయచేసేరు కాబోలు!"

ఆమె నసలు బాధించిన విషయం వేరు. అయినా భర్త పదిమందిలో మంచి అనిపించుకున్నాడంటే కొంత సంతృప్తి కలిగిందామెకు.

"అహా...అలా కాదు. అంతమంది వెంటాడుతూంటే యెలా చెప్పా... మోటుగా వదిలించుకురావడం...... అక్కడికీ యెప్పుడొస్తానా అని జాబోసుకుంటూనే వచ్చేను."

ఆ మాటల్లో యేమాటున యే భావం ఉందో, ఆమె ముఖం కొస్త వికసించింది. తనకోసం భర్త ఆత్రుత చూపించేరు!

అసలామెలో యీమధ్య చిన్న అనుమానం ప్రవేశించింది తనమీద భర్తకు శ్రద్ధ తగ్గిందా, అని పరీక్ష చేయటంలో ఆమె సబబు కనిపెట్టింది. అలాగని ఆమె యెన్నడూ భర్తను అనుమానంతో చూడాలని అనుకోలేదు. అసలు అలాటి అనుమానానికి తావేలేదు. రామం మనసు ఆమెకు కరతలామలకం. మనసులు మాట్లాడుకుంటూంటే తర్జుమా లెందుకు? అనవసరం. కాని అనవసరమైనవికూడా అవసరమవుతాయి అప్పుడప్పుడు. కాని ఈ అవసరాలనేవి చర్చకు చిక్కని మానసిక దశాంశాలు.

ఒకరోజు ఆమె అనుకుంది, పిల్లను చూసేందుకు మనిషి కావాలని. యీ సూచన ఆదిలో చేసింది తనభర్తే. కాని తానే వద్దంది అప్పుడు. అలా అన్నప్పుడు సంసారాన్ని దృష్టిలో పెట్టుకు చెప్పింది. బాధ్యత గ్రహించి చెప్పింది. భర్తకు అదనపు ఖర్చులు లేకుండా చెయ్యాలనుకుంది. ఆనాడు భర్త తెచ్చిన ప్రతి పైసా తన ప్రేమకు పారితోషికంగా భావించేది. సద్వినియోగంలోనే దాని సార్థక్యం ఉంటుందని నమ్మింది.

అసలు ఆమెకు దుర్వినియోగం చేయటం

తెలీదు. జీవితంలో అవసరమైనవన్నీ తెలిసినవే అయితే అవి స్థిరసముదాయాలు కావు అవి మారకతప్పదు. 'అవసరానికి' 'కోర్కెకు' సంబంధం ఉన్నా, మార్పుకు మాత్రం వీటిలో దేటికీ సంబంధం లేదు. కేవలం మార్పుకోసం కోర్కెల్ని పెంచుకొని అవసరాన్ని సృష్టించుకోవడం కృత్రిమం అవుతుంది. కృత్రిమంగా జీవించడానికి మనసారా ప్రేమించడానికి సంబంధం లేదు. ఈ రెండూ విరుద్ధసాంప్రదాయాలు. ఆమె జీవితానికి ప్రేమ ప్రాతిపదిక. ఇదే జీవితానుబంధంగా చేసుకుంది. నిండు హృదయంతో గాఢాభిమానంతో సంసార నౌకను ప్రేమ తరంగాలమీద నడిపించింది; నడుపుతోంది. అనుమానం, ద్వేషం ఎంత గుమారం లేపినా వారి జీవిత కాసారంలో కల్లోలం రాదు అసలు వాటి ప్రమేయం లేని, ప్రవేశార్హత లేని ప్రాంతంలోనే జీవయాత్ర గడపాలనీ వారాశించేరు. అసలు వారి వివాహంలో కూడా యే [illegible] కనపడదు. యథేచ్ఛగా జరిగింది. నిష్కల్మష హృదయాలతో సన్నిహితులయ్యేరు. ఒకరి సాన్నిధ్యంలో వేరొకరు సంపూర్ణ జీవితం గడపగలమని భావించేరు రెండు హృదయాలు ఒకేమారు పలికేయి; ఒకేపలుకు పలికేయి వాటిలో శృతి ఉంది; మేళవింపు ఉంది; మేలుకలయిక ఉంది. అది ఉభయులకూ అవగాహన అయింది. అంతరంగం పలికింది. అనునయం పదిలింది. సంసారంలో దిగేరు. మూడేళ్లు దాటేయి. వాటి కలలు సఫలం కావాలి? అవుతాయా? జాగ్రత్త పడుతున్నారు దానితోపాటు అనుమానం తలెత్తింది. ఎవరి ఆహ్వానాన్ని అందుకోకుండానే అనుమానం ప్రవేశించింది.

ఆ మర్నాడు రామం యింటికొచ్చేసరికి రాత్రి 9 గం|| అవుతుంది. మొహం వాడి ఉంది. తల చెరిగింది. మాట నీరసంగా ఉంది. కోటు తీసి గోడకు తగిలిస్తే చొక్కా చెక్కా తడిసిఉంది. నిస్త్రాణగా మంచం మీద మేను వాల్చేడు. పిల్లమాత్రం పక్కన పడుకొనివుంది భార్య చూస్తూ ఊరుకుంది; తానూ ఊరుకున్నాడు. భోజనానికి రమ్మనిపిలిచింది. రామం జవాబీయలేదు. మళ్ళీ పిలిచింది. అతను లేచికూచున్నాడు; కాని కదల్లేదు. ఆమె గుచ్చిగుచ్చి చూస్తూ ఊరుకుంది. నెమ్మదిగా లేచి కాళ్లు కడుక్కున్నాడు. రోజూలా కూర లేవిటని అడగలేదు. ఆ విషయం ఆమె గుర్తించింది. ఆమె మౌనాన్ని అతను గమనించేడు తన భోజనం తనకలా ఉన్నా భార్యకు మాత్రం తృప్తికలిగించలేదు. అసంతృప్తి అనుమానంకన్నా, అనురా



# విక్టర్ బ్యాండ్ మందిరం

—నాళం కామేశ్వరరావు, రాజమండ్రి.

గాన్నే, హెచ్చుచూపిస్తుంది. భర్తభోజనం ఆమెకు తృప్తికలిగించాలని కోరుకుంది. కాని ఆశాభంగం కలిగింది; మనసు చివుక్కుమంది. అందుకు తనే కారణం అనుకోలేకపోయింది. అసలామెకు అనుమానం కలిగింది కూడా. తన వంట ఎంతో బాగుంటుంది. కనీసం అలా అంటూ ఉండేవాడు భర్త. ఈవేళ కూర సయించలేదో, తన్ను సహించలేదో తెలుసుకోవలసి ఉంది. ఏమైనా తానుమాత్రం మాట్లాడలేదు.

భోజనం చేసినా రామం అక్కడనుండి లేవలేదు. ఆమెకూడా అలాగే ఊరుకుంది. కొంతసేపలా మాస్తూనించుంది. ఆమె లెమ్మందాం అనుకుంటూంటే, అతనే లేచేడు. తన మాటలేకుండానే తన పని అతను చేసుకోగలడు. ఈ భావం ఆమెకు స్ఫురించింది. ఆమె చిన్నబోయింది; అంతకన్నా బాధకలిగింది. ఇదివరలో అతనికి మామూలుగా అన్నిపనులూ ఆమే చేస్తేది. స్నానం చెయ్యమన్న లగాయితూ, ఆఫీసు టైముకి బట్టలువేయడమన్నంతవరకూ తన మీద భర్త అంత ఆధారపడుతూన్నందుకు సంతోషం కలిగేది. భర్త కుపచారం అవకాశం హెచ్చుగా ఉన్నదని ఆ దిందేది. కాని యీమధ్య కొంతకాలవ విసుగుపుడుతోంది. ఇంత బద్ధకమా పించింది. దేనికైనా చురుకుదనం ఉండ చురుకుదనం లేకపోతే సంసారం జి డుతూ ఉంటుంది. దరిద్రంకూడాను. భ పరికిలించేది. ఆవేళమాత్రం అతని పని అ చేసుకుంటూంటే యింకా తన అవస లేకుండా చేసుకుంటున్నాడేమో పించిందామెకి. లేకపోతే యింత స్యంగా రావడమేమిటి? తే చేసువా ఆయన ఆలోచించలేదు. ఈ వ అసలు తన ఊసు బొత్తిగా తలపెట్ట ఇంటికొచ్చేకైనా తన పనంతా అలా చేసుకుపోతున్నాడు; నన్ను ముట్టు కన్నట్టు. అసలు యింత ఆలస్య ఎందుకు రావాలి?

రామాని కన్నీ తెలుసు. అతను పోతే ఆమె బతకటం కష్టం. ఆమె ఎ సార్లు చెప్పింది. చెప్పకపోయినా అ స్వయంగా తెలుసు. అసలు అతనూ అ

# అంతరంగంలో తరంగాలు

చేసేవాడు. ఎంతైనా ఇల్లుదాటి వెళ్ళడం కష్టం; వెళ్ళినా మళ్ళీ యెప్పుడెప్పుడా అని నిమిషాలమీద యింటిమొహం పట్టేవాడు. ఇప్పుడో! భార్య సంగతే ఆలోచించడు.

రామం యెందుకిలా చేస్తున్నాడో ఆమెకి తెలీదు. ఏమైనా అన్నిటికీ అనుమానం మూలం. అది యెంతైనా చేస్తుంది. అనుమానం పెంచుకోకూడదనుకుంది ఆమె. దేనికైనా ఓపికపట్టాలి. శాంతం ఉండాలి. మనశ్శాంతి పోగొట్టుకోకూడదు. అలాగే అన్ని విషయాలూ కనిపెట్టాలి. పూర్తిగా నిజం తెలిసేక ఒక్కమారు అన్నీ అడగొచ్చు.

అసలు యింతకీ ఆమె యింటిదగ్గఱ ఒంటరిగా ఉండలేకపోలేదు. అధైర్యం ఎరగదామె. అధైర్యం అంటే చేతకాని తనమని భావించేది, ఇంతకీ తనబిడ్డవుంది. తనను తన బిడ్డ నుండి వేరుచెయ్యడానికి యెవరివశం? పాలు తాగి పాపాయి ఉయ్యాలలో ఊసులాడుతూంటే సయ్యిమందితో యిల్లు కలకలాడుతున్నట్టుంటుంది. పాలబుగ్గల పాపాయి చల్లని వెన్నెల్లా నవ్వు లొలికిస్తూంటే చూసి ఆనందించడానికి అదృష్టం కావాలి. ఆ ప్రత్యేకత తనకుందని అతిశయం కూడా కలిగింది. తన పిల్లా, తన యిల్లే తన సర్వం అనుకుంది. భర్త యెలా ఉన్నా, తన విధి మాత్రం తాను నిర్వర్తించాలి.

* * *

మర్నాడు మామూలుగా భర్త 9 గం॥కైనా రాలేదు. ఆమె చిరాకుపడింది. చింతపడింది. వంచించబడినట్లు వెలితిపడింది. ఆరోజు 9 గం॥కు వచ్చినందుకే పెద్దసంజాయిషీ చెప్పేరు; ఊరంతా విరగబడి ఆ పేరన్న మనిషి, యివేళకూడా అలాగే చేసేరు. రోజూ యిదొక అలవాటైంది. అతని చేష్టలమాట దేవుడెరుగు; ఆమె కాసుక్కూచోవలసివస్తోంది.

రాత్రయితే పిల్ల పీక్కుతింటుంది. నిద్ర ఉండదు. రాత్రికి రాత్రీ అంతే, పగలుకు పగలూ అంతే. ఇలా అయితే యెలా భరించడం? అసలు తానెందుకు బ్రతుకుతున్నట్టో అర్థంకావడం లేదు. ఎవరికోసం జీవిస్తున్నట్టో తెలీలేదు. అసలు యివి తెలుసుకోవలసిన విషయాలు కావేమో కూడా! తెలుసుకోడానికి ప్రయత్నిస్తున్నకొద్దీ అయోమయం ఎక్కువై సందేహాలు, ప్రశ్నలు కొన్ని పుట్టుకొస్తాయి. వాటికసలు వుత్పత్తిస్థానం జీవితం. ఇది ఒక పెద్ద అగాధం. ఇందులోంచి యెన్ని ప్రశ్నలు పుట్టినా సమాధానం సాంతం లభించదు. అథవా లభించినా, అది విషాదాంతంగానే ఉండవచ్చు. జీవితమే సమస్య అయితే? అసలు జీవితాన్ని ఉపసంహరించుకొనే శక్తి యెవరికీ లేదు. కొందరు జీవితంలో వెనక్కి చూడరు. మరికొందరు ముందుకు చూడరు. యింకోవూ తరగతి యెటూ చూడలేరు. వారికి చూపుతో నిమిత్తం ఉండదు. పాపం! యిలా ఉంది ఆమె అవస్థ.

ఆమె కన్న కలలన్నీ తన కంటిముందే కల్లలయితే, తన పిల్లమాత్రం తన ప్రేమకు శిక్షా అన్నట్టు, కంటిముందు తన జీవితాన్ని మరింత దుఃఖభూయిష్ఠం చేస్తూ నవ్వుతుంది. బిడ్డ కెవ్వుమంటే ఆమెగుండె నీరౌతుంది. పిల్ల ఖక్కుని నవ్వితే మాత్రం తన హృదయం ముకుళించుకొనే ఉంటుంది. ఇది కర్మ కాక యేమనాలి? ఏ కర్మ అయినా ఒకటే నిజం. ప్రాణధారి ప్రతి ఒక్కరికీ జీవితంలో ఒక లక్ష్యం ఉంటుంది. అది సాధించాలి. అందులోనే జీవితమాధుర్యం; సాఫల్యం. లక్ష్యాన్ని తెలుసుకోలేక చాలమంది సతమతమవుతారు. క్రిందుమీదు లవుతారు. నీడకు వాడిచూస్తే పోయేప్రాణంలో కదులాడుతున్నట్టే ఉంటుంది. సత్యాన్ని అవలోకించలేక, ఉనికిని సమర్థించుకోలేక, ప్రకృతిసందేశాన్ని పాలించలేక కృంగిపోతే, ఆ దోషం ఆవేళంలో యెవరిమీదో వేస్తే యేంలాభం? తన భర్త నిజంగా ధన్యుడు. ఇవేవీ పట్టించుకోడు. యేదో తన కనుకూలంగా గడుపుకుపోతాడు. అసలు తన సౌకర్యం మాసుకోవాలంటే యితరుల సౌఖ్యంగురించి ఆలోచించకూడదు. తెలివితక్కువగా తన సౌఖ్యాన్ని త్యాగం చెయ్యాలనే ఉబలాటం పనికిరాదు. తన త్యాగంలో యితరులసుఖం యిమిడి ఉంటుందనుకోవడం భ్రమ.

తన భర్త జీవితం ప్రశ్నపత్రంగా భావించి, ఆయనప్రవర్తన జవాబుపత్రంగా మార్చి మార్కులు వేయడం భార్యపని అవుతుందా? తన విధి తాను నెరవేర్చటంలోనే ఒరుల అవిధేయత బయటపడుతుంది. భర్త రాగానే అనురాగంతో సకల పరిచర్యలు యథారీతిని చెయ్యడం తన విధిగా భావించింది. సరిగ్గా ఇలా భావించే సమయంలోనే బిడ్డ చిన్న తుమ్ము తుమ్మింది. "సత్యం" అనుకొంది. అయినా తుమ్ము అపశకునం అంటారు. యెలా? ఆ! తన పిల్లవల్ల తనకు అపశకునం యేం ఉంటుంది కనుక? తన పిల్ల 'సత్యం' అని చెప్తోంది. అంతే. అదే నిజం. మాపిల్లే సాక్షి. "ఉత్తమసాధ్వనని నేననిపించుకోవాలి." ఆమె నిర్ణయం. అచంచలమైంది.

* * *

రాత్రి పదైంది. అప్పటికే యెంతో ఆలస్యమయింది. యేం చెయ్యడం? ఎంత అనుకున్నా తప్పలేదు. అసలే తన భార్య దుఃఖపడుతోంది. రామం ఎంతో విచారిస్తున్నాడు. ఆమె కెన్నడూ అలవాటు లేదు. తాను దగ్గర లేకపోతే ప్రపంచానికే దూరమవుతున్నట్టు అనుకుంటుంది భార్య. అతనికి ఆ విషయం బాగా తెలుసు. యెంత ప్రయత్నించినా పని తెమల్దు. పదుగురుతో పనా! యెవరినీ నొప్పించకూడదు. శాంతంగా అన్నీ ఒప్పించుకు రావాలి! యెలా సాధ్యమవుతుంది? అసలు నలుగురినీ తృప్తిపరచాలంటే ప్రపంచంలో యెవరికీ సాధ్యంకాదు. అందరికోసం ఆలోచించేవాడు యెవరికోసం పని చేయలేడు. ఒక ప్రక్కనుండి తన విధి నిర్వర్తిస్తున్నానని అనిపించినా, యెక్కడో యేదో పొరపాటు జరిగిందని తనకు తెలీకపోలేదు. అప్పుడప్పుడు యేదో వెలితిగా ఉన్నట్టనిపిస్తుంది. తనకు సన్నిహితము, సర్వస్వమూ అయిన యేదో వస్తువును తాను తిరిగి కనిపెట్టవలసి ఉంది. అది లీలగా అనిపించేది. అది జీవితానికి అవతలగట్టున ఉన్న బాదరాయణ సంబంధమేమో!

అస లెప్పుడూ లేదింతలా. అనుకోకుండా యెంతో ఆలస్యం చేసేడు రామం. పాపం భార్య యెంత బాధపడుతుందో! ఆమె విచారించడంకన్న ఆ విచారం తనపై ప్రసరించడం అనేది తానూహించుకోలేకపోతున్నాడు. యెవరికైనా విచారం

సహజం. యెందుకైనా వస్తుంది. కాని అది తనకు సంబంధించినంతవరకూ సహజము, సమంజసమున్నూ; యితరులకు సంబంధించి నంతవరకూ అది చిరాకుగానో కోపంగానో, ప్రకటితం అవుతుంది. దాని వల్ల జాలికన్నా కోపం హెచ్చు కలుగుతుంది. కాని రామం తన అర్ధాంగిని కోపగించడానికి యిచ్చగించడు. అది యెన్నడూ అనుభవించలేని దుర్దశ. అతనికోసం తన సర్వస్వం అర్పిస్తున్న అర్ధాంగి పై కళ్ళెఱ్ఱ చేయడం మూర్ఖత్వం, నిజమే. అయితే యెలా ఆమెను సముదాయించడం.? తాను ఆలస్యంగా యింటికివస్తే ఆమె దుఃఖపడుతోంది. సంజాయిషీ యేమని యిచ్చుకోవాలి? సంజాయిషీ సమర్థన కుపకరిస్తుంది కాని గ్రీవెన్సు తొలగిస్తుందా? దానికి ఒకటే అర్థం ఉంది. నేను చేసిందే సరియినది; నువ్వు అపార్థం చేసుకున్నావు; యిది నిరర్థకం; నువ్వు నీ అభిప్రాయం సీదాగా మార్చుకోవాలి. కాని తానలా చెప్పలేడు. ఆమెది సున్నితమైన మనస్సు. మోటుగా మాటాడితే ఆమె హృదయం కంపించిపోతుంది. మాట్లాడ్డం కాదు ముఖ్యం. ఆ భావాలు అలా ధ్వనిస్తే చాలు. ఆమె వణకిపోతుంది. ఇది తాను చేయలేని పని. ఇప్పటికే ఆమె యెంతో యాతనపడుతోంది. లోలోపల యెంతో కృంగిపోతోంది. తన హృదయాన్ని గాయపరచడం కూడదు. పాపం! యెవరికైనా యెంతో కష్టం అనిపిస్తుంది. రోజల్లా పిల్లతో కాలం గడపాలి. వేరొక రెవరున్నారని? జీవితం దుర్భరం అవుతుంది. తను డ్యూటీ పేరుతో బయటకొస్తున్నాడు. పదిమందినీ కలుస్తున్నాడు. తన పనిలోనే ఆనందం పొందుతున్నాడు. భార్యో! పంజరం లోని చిలుక. గడప దాటదు. భర్తమాట జవదాటదు. తన పలుకు ప్రాణ్నం కాపాడుతూ కూచుంటుంది. ఇదంతా ఎవరికోసం? ఆమె కోసమేనా? ఆమె అంత స్వార్థపరురాలు కాదు. తనకోసం తనజీవితం వెచ్చించడంకన్నా జీవితానికి విడాకులియ్యడం ధర్మమని ఆమె ఉద్దేశం. ఆమె యే పని చేసినా, చేయ తలపెట్టినా భర్తను తలచుకుంటుంది. భర్తకు ప్రీతి కలిగే పనులే చేయాలనుకుంటుంది. అయితే రామం యేం చేస్తున్నాడు? యాంత్రికంగా జీవితం గడుపుతున్నాడు. భర్త చేస్తున్నదీ, చూస్తున్నదీ తన కవసరం లేదు. తన అవసరమల్లా అనుభవించడం, ఆస్వాదించడం. పాపం ఆమె యెంతో కష్టపడుతోంది. కనీసం పనిమనిషైనా పెట్టలేదు. ఎంత పని చేసేడు!

ఇదివరలో పెడదామంటే ఆమే వద్దంది. తీరా యిప్పుడు ప్రయత్నం చేస్తే ఎక్కడా మనిషి దొరకడాయె. తానిచ్చేది తక్కువ. ఎక్కువకాలం పనిమనిషి తన గడపలో కాలం గడపాలి. ఎవరు వస్తారు? తన అవస్థను యేమనుకోవాలో తెలీదు. హుషారుగా ఉన్నప్పుడు ప్రపంచం అంతా ఆకళించుకున్న మనిషిలా కనపడతాడు. కాని నికి తన భార్యే తనకు తెలీదు. అన్నిటనే మూలం అనుకుంటాడు. కాని

# ★ అంతరంగంలో తరంగాలు ★

సంసారానికి తన ప్రయోజనం శూన్యం. అక్కర్లేని వాళ్ళఅవసరాలకి మాత్రం తగుదునమ్మా అని బయలుదేరడం, తనవాళ్ళకి తాను కాకపోవడం! యేమిటిది? త్యాగం చేస్తున్నాడా? లేదు. త్యాగానికి తాను ఒప్పుకోడు. తన భార్యాబిడ్డల సౌఖ్యాన్ని త్యాగంచెయ్యటానికి తనకేం హక్కుందనీ?

చక్కా వీధిలోనుంచొచ్చి 'అమ్మయ్య!' అని నడుం చేరేస్తూనే భార్యకు పని కల్పిస్తాడు. ఇది మగజాతికున్న వీక్ నెస్. తమ ప్రాధాన్యతను యెక్కువ మక్కువతో ప్రదర్శిస్తారు. రామం నిజానికి యిలా చెయ్యాలని యెన్నడూ అనుకోలేదు. పైగా తన కసహ్యం కూడాను యీ పద్ధతి. అయితే యేం లాభం? తానా గిరి దాటలేకపోతున్నాడు. తన భార్య అనేదే అది. యేమైనా భార్యలోమాత్రం లోపం లేదా? తీరా యింటికొచ్చేసరికి మొహం ముడుచుక్కూచుంటే తన గతి యేం కావాలి? రుసరుసలు బుసబుసలు లేకపోవచ్చు అయితేనేం? అంత పనీ అవుతోంది. తన నొక కిరాతకుడుగా చూస్తోందో యేమిటో! పంజరంలోని పిట్టమీద బాణం యెక్కుబెడుతున్నా డనుకుంటుందో యేవిటో? ఇంత అపార్థం ఉంటే, తనెలా వాటిని త్రోసిపుచ్చటం? అవే నిజమని వాటిని ధృవపరుచుకోవాలా? అతనికి కష్టం అనిపిస్తుంది. గుండె బేజారవుతుంది. సంఘం వెక్కిరిస్తున్నట్టనిపిస్తుంది. ప్రపంచం తనమీద పగతీర్చుకుంటోందనుకుంటాడు.

తన భార్యమీద రామానికి జాలియేంతుందో వెగటూ అంతుంది. ఆ జాలైనా పైవాళ్ళమీద చూపించే జాలిగానే ఉంది. ఇలా చూస్తూన్నాడంటే తనది మాత్రం తప్పుకాదు. తప్పంతా తన భార్యదే. ఆమే తనను వేరుచేసింది. తనకున్న భావమల్లా వేరు. 'నేను' 'నా భార్యాబిడ్డలు' అని ఆలోచించకుండా ఉండటం అవసరం అనిపించింది. అది నిస్వార్థం అనుకున్నాడు. ఇందులోనే మంచి ఉందనుకున్నాడు. పాపం! రామానిది వింత ప్రకృతి. పైవాళ్లు అవునన్నదల్లా మంచి దనుకుంటాడు. పోనీ మంచికోసు మనకెందుకని ఊరుకుంటాడా అంటే, ప్రపంచంలో మంచిని సంరక్షించే బాధ్యత తన భుజస్కంధాలమీద ఉందనుకుంటాడు. ఈ వింత వైఖరివల్ల చింతాక్రాంతుడైన రామం యిల్లు చేరుకోనేసరికి, తనకన్నా తన భావాలే హెచ్చుదూరం పయనించేయి.

* * *

పిల్ల అవ్వేళ యెల్లాగో ఆడుకుంటోంది. అచ్చే లేదు. నిద్రలోనే కాస్త కళ్లువిప్పి తియ్యగా నవ్వింది. ఆ మొహం తన మమకారాల మూసలా వుంది. ఆ కంటిలో ఓ కొంటెతనం తనని పలకరించింది. ఆ పసిపాప పడుక్కుంటే పండువెన్నెల పళ్లెంలా వుంది. తన కెంతో హాయి అనిపించింది. తన ప్రేమఫలాన్ని పూలపాన్పుమీద అమర్చి, మందారమకరందం అమందానందంతో సమర్పించా లనుకున్నాడు. నిత్య నూతన కళావిలాసాలతో రచించిన అపరిచిత ఆనందమయ సౌధంలో సకల సుకుమారంగా పెంచి పెద్దచేయాలనుకున్నాడు. తన బిడ్డలోనే తన భావి నూహించేడు. పాపాయిపై చల్లగా చెయ్యి నిమురుతూ తియ్యని నెయ్యంతో సతీమణి నుద్బోధించేడు...జవాబు లేదు...మొదటి మారుగా సమాధిలోంచి అగాధంలోకి దిగేడు. భార్య...అల్లాగే ఊరుకున్నాగు, చింతగానో, నిశ్చింతగానో. నెమ్మదిగా ఆమె వచ్చి నించుంది తన మ్రోల. వెంటనే పలుకనందుకు యెంతో నొచ్చుకుంది. కాని తన భర్తలో మాత్రం పునర్విచారణ ఉన్నట్టు కనిపించలేదని ఖిన్నవదన అయింది.

రామానికి యేంచేయాలో తెలీక పిల్లవైపు చూస్తూ కూర్చున్నాడు. ఇంత ఆదరం యెక్కడనుంచి వచ్చిందా అనుకుందామె. ఇవేళ పనిపిల్లగురించి మాట్లాడేనన్నాడు. తనని మంచిచేసుకోడానికి ప్రయత్నించడంకన్నా; ఆయనే మంచిగా సంచరించడం సబబు అనుకుందామె. ఏమీ మారు పలకలేదు. "పనిపిల్ల లేకపోతే నువ్వు పనిచేసుకోడం చాల కష్టం సుమా" అన్నాడు రామం. ఏ పిల్ల ఉంటే మాత్రం ఆమె అర్ధరాత్రి లేవక తప్పుతుందా? సంసారాన్ని బరువుచేసేది పనికాదు; పనిమనిషి వచ్చి తేలిక చేయడానికి.

"ఇప్పుడెందుకు లెండం"ది ఆమె ప్రయత్నపూర్వకంగా మాట్లాడుతూ. భార్యకు ఎలా ఉపకరించగలుగుతాడో తెలీలేదు రామానికి.

"ఇప్పటికైనా లేచి భోంచేస్తారా?"

ఆ మాట చాల కటువుగా ఉంది. కష్టాలకామె బందీఅయినట్టు కనపడింది. హాయిగా తింటూ కూచోడం పశుత్వం అనుకున్నాడు రామం.

"అట్టే ఆకలి లే"దన్నాడు.

ఇంకెంత దుఃఖ పెడతారో పెట్టండనుకుంది ఆమె.

"లేచి నాలుగు మెతుకులు తిందురుగాని రండి" అంది.

"తింటే నాలుగు మెతుకులే" అన్నాడు రామం.

అంతకు హెచ్చు తినకూడదని నిర్ణయం చేసుకున్నా రనుకుంది ఆమె.

అతను భోజనం చేసి చెయ్యి కడుక్కున్నాడు. ఆమె చెయ్యి కడుక్కోకుండానే కళ్లు తుడుచుకుంది.

ఆరాత్రి యిద్దరూ ఒక్కచోటే పడుకున్నారు. కాని యెంతో దూరంలో ఉన్నారు. ఇద్దరూ ఒకే విషయం ఆలోచిస్తున్నారు. కాని యెంతో తేడా ఉంది. కోల్పోయిన ప్రేమధనాన్ని పునరార్జన చెయ్యడం యెలా అని యిద్దరూ ఆలోచిస్తున్నారు. ఇద్దరూ తమ పిల్ల గురించే ఆలోచించేరు. పిల్లమాత్రం తల్లికి సన్నిహితంగా జరిగింది. తాను నిజానికి ప్రపంచానికే దూరమవుతున్నా ననుకున్నాడు రామం.

రామం భార్య మొహంలోకి తొంగి చూసేడు. కళ్లు కొలకులలో కునుకుతున్నట్టున్నాయి. మొహం పీకుపడి ఉంది. ఏదో వ్యాధిపీడితలా ఉంది భార్య. గుండె వేగంగా కొట్టుకుంది. భార్య నుదురుమీద

(54-వ పేజీ చూడండి)

పెద్దకథ

# వరులూ – వారసులూ

శ్రీ మునిపల్లె రాజు

(గత సంచిక తరువాయి)

## 6

ఈ మాటు సత్యం శ్రీరాములుగారితో కలిసి కలెక్టరు దగ్గరకెళ్లాడు. ఎవరిపుణ్యమో మరి? బీద చేనేత పనివాళ్ళకు గంజి సత్రం వచ్చింది.

ఈ పల్లెల్లో కొత్త పాలకజాతి ఉద్భవించింది. పాత జమీందార్లుగాదు; మిల్లర్లు, కంట్రాక్టర్లు, బస్సు ఓనర్లు, లీడర్లు, పంచాయతీదార్లు. అన్ని అహంభావాలూ మూర్తీభవించిన అవకాశవాదుల పాలకజాతియిది. ఏ హరిజనుల కాయకష్టంవల్లనో పండిన పంటల్ని పదింతల కమ్ముకొని, మిల్లర్లై, ముఠాదార్లై, బస్సురూట్లు, కొత్తహోటళ్లు, పెద్ద పర్మిట్లు సంపాదించి, పరపతి సంఘాల పేరుతో స్వలాభం చూసుకొని, పొట్టలు పెంచుకొంటున్న కొత్త ఫాసిష్టుముఠా – యీ పాలకజాతి. చదివింది ఎంత మిడిమిడి ముక్కలైనా షెల్ కళ్ళజోడు ఫ్రేములతో, సిల్కు లాల్చీలతో, పేటంచు వుత్తరీయాలతో త్రేన్చుతూ హోటళ్ళ చుట్టూ మూగి బస్తీవాళ్ళు మనిపించుకోనేందుకు పరుగులిడుతున్న కొత్త పాలకజాతియిది.

చేనేత పనివాళ్ళకు సహాయం చెయ్యమన్నప్పుడు – "పోవయ్యా, బాపనయ్యా – పనిలేని మంగలి పిల్లిలత గొరిగాడన్నట్టుంది. ఆళ్లసంగతి నీకెందుకయ్యా; నీసంగతి నువ్వు జూసకోక" అని శ్రీరాములుగార్ని తరిమివేసింది యీ బలిసి కొవ్వెక్కిన ముఠాలే. రాజకీయ బాధితుడుగా ఆయన సంపాదించుకొన్న నాలుగెకరాల కొండ్రకు – కుల ద్వేషాలతో అడ్డుతగిలి పుట్టిన పట్టాను పొట్టబెట్టుకొన్న యీ ముఠావద్దకు శ్రీరాములుగా రెందుకు వెళ్ళాడో అని సత్యం గూడా గినుసుకొన్నాడు.

కొత్త గంజిసత్రంలో ముసలివాండ్లకు, పసిబిడ్డలకూ, గర్భిణీస్త్రీలకు మాత్రమే గంజి దొరుకుతుంది. శ్రీరాములుగారు పట్టుబట్టి కరణంగారి చేత తాయారమ్మను గర్భిణిగా నమోదు చేయించాడు.

గంజి సత్రం కమిటీలో షావుకారు కిష్టయ్యవంటి నాయకులు, భీమయ్య, రైతు మీటింగుల్లో ఖద్దరు చీరెలుగట్టి పాటలు పాడే భారతమ్మగూడా వున్నారు. రంగనాయకులు గంజివరసలో నిల్చొన్న తాయారమ్మను జూసి "నువ్వెందుకొచ్చావ్?" అని గద్దించి అడిగాడు. అతను కోటిలింగం యివ్వజేలిన బాకీమాట మరిచిపోలేదు.

తాయారమ్మ కరణంగారి చీటి చూపించింది. రంగనాయకులు ఆ చీటి తీసుకొని కిష్టయ్యతోను, భారతమ్మతోను సంప్రదించాడు. ఆ ఇద్దరు కలిసి కర్ణంగారిని పిలిచి అడిగారు. ఆరోజున తాయారమ్మ వట్టిగిన్నెతోనే యింటికి వచ్చింది. కోటిలింగం అరుగుమీద కూచొని ఆమెను చూడనట్టే నటించాడు.

గంజి సత్రం కమిటీలో శ్రీరాములుగారికిగాని, సత్యానికిగాని స్థానం దొరకలేదు. మీదు మిక్కిలి వూళ్లో దోపిడిగాళ్ళకు, భారతమ్మవంటి మోసగాళ్ళకు, ఓట్లలాలింపు గాళ్ళకు, కొత్తపాలకజాతి ముఠావాదుల కందరకూ అది కొత్త కొర్కానా అయిపోయింది. కొత్తరూపాయల నోట్లకది కొర్కానా.

సత్యం మొదట్లో నిగ్రహించుకొన్నాడు. కాని భారతమ్మ దౌర్జన్యంతో షావుకారు ముఠామోసాలు కలిసి కడుపు కాలుతున్న వాళ్ళనే దోచుకుతింటున్నవి. నిజమైన బాధితులూ, పేదలూ గంటలకు గంటలు సత్రంముందు పడిగాపులు గాచిపోతున్నారు. కాని భారతమ్మ అరుగిద్దల మానికసంగతి బయట పొక్కనివాళ్ళకు, మాష్టరు పీవర్లతోచేరి చేనేతసంఘాలకు ద్రోహం చేసినవాళ్లకు పొగిడి పొట్టనింపుకునే వాళ్ళకు— గంజికేంద్రం ధర్మసత్రమైపోయింది. ఇకసత్యం ఆగలేదు. ఆ ఉదయామే, గంజిచేస్తామని కొలిచినధాన్యం, దొంగదారులగుండా దొరలయిళ్ళు చేరకుండా కాపలాకొస్తానని నలుగురు కుర్రల్ని వెంటబెట్టుకొని వెళ్ళాడు.

ఆరోజునే రామానుజయ్యతాత భద్రా ప్రయాణం పెట్టుకున్నాడు. ఆయన పాటు సత్యం తండ్రి అమరయ్యగూ బయలు దేరాడు. అప్పటి తాత బెట్టిన వారంరోజుల గడువూ ద పోయింది.

తాత బయలుదేరేముందు తన మఠం లోని వస్తువులన్నీ కోటిలింగానికి అప్ప చాడు. వుంచమనిగాదు; బీదల కిమ్మని.

"అదేమిటి తాతా! నువ్వు తిరిగి రా రేమిటి? కుండలూ గుహూ్ళ అందరికీ ఇ నువ్వు వచ్చింతర్వాత నీ పనేమవుతుంది అని కోటిలింగం ప్రశ్నించాడు.

"నీకు జెబితిని గదా? ఎవరి కవసర వాళ్లకు పోతవి యీ సామాన్లు.

# ★ వీరులూ, వారసులూ ★

దాచినా నాకొడ నిలిచేది లేదు."

కోటిలింగాని కేమీ అర్థంగాలేదు - యీ సమాధానం.

"మళ్ళెప్పుడు తిరిగివచ్చేది తాతా? నవమి వెళ్ళంగనే వస్తావుగా?"

తాత తన తాంబూరవంక జూసి— "సద్గురు కటాక్షం" అని వూరుకొన్నాడు.

ఆనాడు చీకటిగదిలో, మాటల మధ్యలో రామానుజయ్య అకస్మాత్తుగా మూసం దాల్చడం జ్ఞప్తికి రాగానే కోటిలింగానికి తిరిగి భయం ఆవహించింది.

"తాతా, నీమాటలు వింటుంటే తిరిగి వచ్చేట్టుగా లేవు. ఎన్నాళ్లుంటావో చెప్పవా?"

"నేను రాకపోతే, నువ్వయినా కొడ కొస్తావుగా?" అన్నాడు తాత.

కోటిలింగం తాతకళ్ళవంక చూశాడు. ఆ కళ్ళు తొణకలేదు. అతనికేమీ సమాధానం దొరకలేదు.

"ఎందుకురాను? నేనూ భద్రాద్రివస్తా" నువ్వురాకపోతే మర్నాడే బయలుదేరి వస్తా."

ఇంతలోకే చిన్నమాటతో అమరయ్య వచ్చాడు. ఆ సంభాషణ ఆగిపోయింది. కాని కోటిలింగం మనసు అస్థిమితమై, ఆందోళనా పూరితమైనది. అతనికేమి చేయటమో తోచలేదు. వాళ్ళు బస్సు దొరకలేదని స్టేషనుదాకా నడిచి రైలందుకోబోతున్నామన్నారు. వాళ్ళతోపాటు కోటిలింగంగూడా రైలుస్టేషనుకు బయలుదేరాడు."

* * *

కాళ్ళీడ్చుకొంటూ పిచ్చి ఆకారంతో కోటిలింగం యిల్లుజేరాడు. అతను గడపలో కాలుబెట్టకముందే తాయారమ్మ వచ్చి— "సత్యాన్ని పోలీసులు పట్టుకెళ్ళారు" అంది సగంఏడుస్తూ.

"సత్యాన్నా?"

"గంజికొడ గలాటా జరిగిందిట."

కోటిలింగం కాళ్ళు వణికినవి సత్యం! ఇతరుల కష్టాలు నవ్వుతూ భరించగలిగిన వాడు అన్యాయాన్ని దహించివేయగల సత్యం!

అతని తండ్రి అమరయ్య యిప్పుడే భద్రాద్రిక్షేత్రం వెళ్ళాడు. ఏమీతోచక పైకండువా నేలకు విసిరికొట్టి సత్యం యింటివేపు రివ్వున పరుగెత్తిపోయాడు. అక్కడ శ్రీరాములుగారుగూడా వున్నారు. ఆడంగులూ, పిల్లలూ లబోదిబో మంటున్నారు.

శ్రీరాములుగారు ముందుకువచ్చి -"మనం బెయిలుకోసం వెతకాలి. ఎవరు దొరుకుతారో కొంచెం ఆలోచించు" అన్నారు. సత్యానికి బెయిలు యివ్వటానికి వందమంది వున్నారు. కాని ఎవరు? మిల్లర్లు, కంట్రాక్టర్లు, మాష్టరుపీవర్లు, దోపిడిదార్లుగాదు. దమ్మిడీ ఆస్తిలేని కూలిమగ్గంవాళ్ళు; కడుపుగాలినా,మగ్గంవదలని నేతగాళ్లు. మాణిక్యం, చెన్నమ్మ, బిడ్డలకు తిండిబెట్టలేక నల్లమందు నూనితాగి చచ్చిన గురునాధం, మొగుడి కళ్ళముందే భావిలోపడ్డ ఓబులమ్మ - వందలొందలున్నారు. కాని దమ్మిడీ నగదు చూపించలేని వీళ్ళ బెయిళ్ళు ఎవరిని నమ్మించగలవు?

శ్రీరామనవమి వెళ్ళిపోయింది. సత్యం జైలునుండి బయటకురాలేదు. భారతమ్మను కొట్టిన కేసు రిజిష్టరయింది. భీమయ్య,

రంగనాయకులు సాక్షులు. "సత్యం ఏరెండేళ్ళకు బయటకు వచ్చినా వచ్చినట్టే" అన్నాడు శ్రీరాములుగారు.

## 7

ఈ లోపల జైల్లో సత్యాన్ని చూట్టానికి శ్రీరాములుగారితోపాటు తనూ బయలు దేరాడు కోటిలింగం. సత్యంవంటి కార్య వాది, కుర్రవాడు, ఉత్సాహి నాలుగు గోడలమధ్య కూచోనటం వూహించు కొంటే, జీవితంలోని వైపరీత్యం అర్థమయింది కోటిలింగానికి.

"మానాయన కేమీ గాబరాగా చెప్ప వద్ద"ని సత్యం పదేపదే నొక్కి చెప్పాడు. అమరయ్య యింకా వస్తేనేగదా. వచ్చిం తర్వాత చెప్పక తప్పుతుందా?

సత్యాన్ని చూచిం తర్వాత తను మాట్లాడదలచుకొన్న మాటలన్నీ మర్చిపోయి, అతని మాసిన గడ్డంవంక కళ్ళప్పగించి పరికిస్తూ కోటిలింగం హృదయాంతరాళంనుండి వెలికిరాని వెతతో సంఘర్షిస్తున్నాడు. మాట్లాడిందంతా శ్రీరాములుగారే. ఆయన గూడా, మాట మాటలోనూ, పొల్లు పొల్లులోనూ నిరాశ వెదచల్లుతున్నట్లు దిగులుగా, దిక్కుతోచని మాటలు మాట్లాడాడు. ఆయన కష్టసుఖాల లోతులు చూచినవాడు గావటంచేత మొదటినుంచీ సాక్ష్యంకోసం తగు ప్రయత్నాలు చేస్తున్నాడు. కాని సాక్ష్యమా దొరికేది?

"ఎవళ్ళకు వాళ్ళు భయపడుతున్నారు. ఈ కరువు కాలంలో ఎవళ్ల నోటిముందు కూడు ఎవళ్ళు పోగొట్టుకుంటూ రంటావ్? చివరికి మనతో తిరిగే వెంకటప్పడు గూడా భీమయ్యను చూసి, రంగయ్యను చూసి బెదిరిపోతున్నాడు. సత్యం...! నా కెప్పుడూ, ఎన్నడూలేని నిరాశ వేస్తున్నది. కాలం మారిపోయింది సత్యం!! డబ్బు ముందు, నీతి రాజ్యం చెయ్యలేకుండావుంది" అవును, కోటిలింగంగూడా అనుకొన్నాడు. ఇదంతా కాలజ్ఞానంలో చెప్పలేదా? కలికాలంయొక్క నిజస్వరూప మిది. ధర్మచక్రానికి బూజుపట్టిపోయింది. న్యాయదేవత నాలుక తెగిపోయింది. ఆమె కాళ్ళు విరిగిపోయినవి.

సత్యం, ఒక్కసారి ఆ యిద్దరివంకా చూసి— "శ్రీరాములుగారూ! మీకు మేమంతా ఋణపడివున్నాం. అది తీర్చుకో నేమాటవట్టెది. కాని నేను జైల్లో వుంటమేమంచిదంటాను. మనవాళ్లకుబుద్ధివస్తుంది. నేను కనబడకపోతేనే వాళ్లల్లో ఐకమత్యం కుదురుతుంది. నన్నుగురించిన ప్రయత్నాలిక మానటం మంచిది. ఆ గొర్రెమందలో దాగిన పులుల్ని మీరు ఒక కంటకనిపెట్టి వుండండి. మనవాళ్లకు సలహాలిస్తూ వుండండి" అన్నాడు. సత్యం నివారించాలని ఎంతప్రయత్నంచేసినా అతనికంఠం గద్గదికంగానే వినిపించింది.

శ్రీరాములుగారు ఒక్కసారిగా పెదిమ విరిచాడు.

"ఇంకా యింతపిచ్చిలో బడుతున్నావు సత్యం. ఐకమత్యమంటున్నావు. ఇంకేం సంఘం? గంజిమంత ముందు అన్నీ కూలిపోయినాయి. మానవుల ఆత్మతత్వమే మారిపోయింది. భార్యతో అబద్ధమాడి భర్త గంజి తాగేస్తున్నాడు. పిల్లలనుండిదాచి తల్లి గంజి మాయంజేస్తున్నది. ఆకాశం విరిగిపడ్డమే తరవాయి సత్యం. మానవత్వం తన ఆఖరి దశలోవున్నదంటే నమ్ము. అంతదాకా ఎందుకు? వాళ్లందరికోసం ఆ దుర్మార్గులతో కయ్యం తెచ్చుకున్నావుగదా? ఇప్పుడు నీకు వ్యతిరిక్తంగా, ముంతెడు గంజికోసం నిన్ను జైలుపాలు చెయ్యటానికి సిద్ధంగా వున్నారు. "నీవాళ్ళు" శ్రీరాములుగారు ఏ సమయంలోనైనా యింతటి కడుపు దరిగేమాటలు మాట్లాడగా వాళ్ళిద్దరూ వినలేదు. దూరపు ఆశలతో, నిత్యోత్సాహియై బ్రదికిన ఆ శ్రీరాములుగారేనా యీయన? తన దారిద్ర్యాన్ని దాచుకొని, ధర్మాన్ని, గాంధీని నమ్ముతున్న శ్రీరాములుగారేనా యీయన?

సత్యం ఆయనకు నమస్కరించాడు.

"పోనీండి. మానవత్వమంతా యింకి పోనీండి." ఇంతటికి యిక ఆపమన్నాడు, అక్కడ నిలుచున్న పోలీసు.

"ఏమోనోయ్ సత్యం! నాకు జీవితమంటే అసహ్యం కలుగుతున్నది. మా అమ్మగారు కాటికి కాళ్లుజాచి కూర్చున్నది. ఇవ్వా[ళో రే]పో అంటున్నది. నీతో ఎప్పుడై[నా] చెప్పానా, ఆమెకు తిండీ తిప్పలూ, మ[ం]దూ మాకూ అమరటంలేదని?"

సత్యం కళ్ళనిండా నీరుకమ్మింది. కో[టి]లింగం నిశ్చేష్టుడై ఆ మాటలు విన్నా[డు.] దేశభక్తుడు! బ్రిటిష్ సామ్రాజ్యవాదా[న్ని] యెదిరించిన ఆనాటి దేశభక్తుడు! మాతృ[దేశా]నికి తన యౌవనకాలాన్ని సమర్పిం[చిన] రాజకీయ బాధితుడు! తన జీవితం[లో] మూడవభాగం కారాగారాల్లోనే గడిపిన క[ర్మ]యోగి! శ్రీరాములుగారు!!

"మాకు చెప్పదగిన పెద్దలు. మీరుగూ[డా] వెనుకంజవేస్తే యింకేముంది? పోనీండి. లోకం, యీ దానవ సమాజం అం[తా] నాశనం కానీండి. మీరు కిందటిసారి [నా]కిచ్చిన పుస్తకం రెండుసార్లు చదివాను. దుఃఖాన్నుండి కొత్త సమాజం, కొ[త్త] మానవులూ పుడతారని వ్రాశాడు. [...] నిజం. అదే తథ్యం. శ్రీరాములుగా[రూ!] తిండి పెట్టలేని లోకం ఏం లోకం?" సత[్యం] బిగువుగా, కంఠమంతా వుబుకుతూ, [...] ధాటిగా ఈ మాటలన్నాడు. సత్యం[...] కళ్లెంవేసిన యీ కోపాన్ని యిదివ[రకు] కోటిలింగం గూడా చూడలేదు. [...] పోలీసువచ్చి సత్యాన్ని లోపలకు పెట్టా[...] వెళ్ళేటప్పుడు, కోటిలింగం వుత్తరీం[...] తాకి—"యింటిదగ్గర జాగ్రత్తగా చూ[...] కుంటూండు బావా!" అని మరలా[...] బయటకు మళ్ళినప్పుడు, కోటిలింగా[...] దారి కనపడలేదు. "ఈ లోకాన్ని నే [...]



అజంతా　　　　　　　　సగిరియా (సింహళం)

ప్రాచీన చిత్రకళలో రాజకుమార్తెలు

నమూనాలు : ఏలూరి నాగభూషణం, చెన్నపల్లిపాలెం, (నెల్లూరు జిల్లా)

# వీరులూ, వారసులూ

గను. నేను గుడ్డివాణ్ణి నాకు తెలియని సంగతులన్నీ అంత విపులంగా సత్యం, శ్రీరాములుగారు మాట్లాడుకొన్నారు. నేను మానవుణ్ణి తెలుసుకోలేదు నేను గుడ్డివాణ్ణి" అనుకొన్నాడు. దారిలో పిరికిగా శ్రీరాములుగారిని స్పృశించబోయినాడు. శ్రీరాములుగారు వెనకకు చూచి—"పిచ్చివాడా!" అని అతని వీపు తట్టారు.

* * *

ఇంటికి వెళ్ళగానే మొదట, అమరయ్యమామ భద్రాద్రినుంచీ, రామానుజయ్యతాతతో పాటు తిరిగి వచ్చాడేమోనని చూడబోయాడు. కాని రాలేదు. అక్కడనుండి రామానుజయ్య తాత మఠం గదికి వెళ్ళి, తన బొడ్లో భద్రంగా దాచుకొన్న తాళంచెవితో తలుపు తెరిచి లోపల కాలు పెట్టాడు. అంతా దుమ్ముగా వున్నది. తాత తాంబూర, ఇంకోమూల పాతకుండ ఒకటి మాత్రమే ఆ గదిలో యింకా మిగిలివున్న వస్తువులు. కోటిలింగానికి కెందుకో భయం వేసింది. తాత యీమధ్య అన్న మాటలు అతి రహస్యగర్భితమైనవని తిరిగి తోచింది. పోనీ, శ్రీరాములుగారిని అడుగుదామా? అని తలపోశాడు. కాని ధైర్యంచాలలేదు. ఏమని అడగటం అసలు? తనకు ఒక్క మాటకూడా పెగిలిరాదు. రామానుజయ్య తాత తిరిగివస్తాడా? ఎందుకురాడు? మరి అతని వీడ్కోలుమాట లేమిటి? కోటిలింగానికి ఆ గదిలో ఒంటరితనం భరించలేనిదయింది. గోడమీదబల్లి, వేళ్లాడే సాలీడు, తాంబూరకుంచె, పగిలి కిందబడిన మట్టిప్రమిదె తన అంతరాత్మలో దూరి తనను, తనమస్సును, తన భవిష్యత్తును పరీక్షిస్తున్నట్లుగా తోచింది. ఎందుకతోచింది? అతనికి రామానుజయ్య వస్తువుల్ని తాకి కళ్ళకద్దుకోవాలని అంతరాంతరాలనుండి నెల్లువై ఉద్వేగం వచ్చింది. అతను వణికిపోయాడు. వణుకుతూన్న చేతులతోనే తాంబూర కదలించాడు. దానికింద రామానుజయ్య తన కెన్నోసార్లు చదివి వినిపించిన "కాలజ్ఞాన గ్రంథం" వున్నది. కళ్ళ కద్దుకొన్నాడు. తంబుర పైకెత్తబోయినాడు. కాని అది ఆ అస్థిర హస్తాలలో నిలవలేదు. భూపతనమై పడిముక్కలైపోయింది. కోటిలింగం హఠాత్తుగా పెద్దకేకవేసి ఆ గదినుండి బయటకు పరుగెత్తాడు. కాళ్లు, హృదయం, తల విఘడియనుండి విఘడియకు ఉధృతమైన వేగంతో చలించి కదిలిపోతున్నవని గ్రహించాడు. తలుపుకు తిరిగి తాళంకూడా వేయకుండానే యింటికి ఎట్లాగో చేరాడు.

"ఎందుకట్లా వణికిపోతున్నావ్?" అంది తాయారమ్మ.

కోటిలింగం ఆమె కళ్ళల్లోకి సూటిగా, గూసి, "నాకు కొంచెం గంజివుంటే పొయ్యి" అని మాత్రం అనగలిగాడు.

## 8

అర్ధరాత్రివేళ వరండాలో పడుకొన్న తాయారమ్మయింట్లో పెద్దకేక బంధిని లేపింది. వరండాలో కోటిలింగం లేడు.



మధుర స్మృతి (అజంతా)

నమూనా: వీలూరి నాగభూషణం, చెన్నపల్లిపాలెం, (నెల్లూరు జిల్లా).

లోపల గుడ్డి కిరసనాయిలుబుడ్డి వెలుగుతున్నది తాయారమ్మకు భయంవేసి కేక వేయబోయింది కాని పిల్లలు లేచి ఏడుస్తారేమోనని చటుక్కున ధైర్యం తెచ్చుకొని, దగ్గరగా వేసివున్న తలుపులు తెరచుకొని లోపలకు అడుగు పెట్టింది

శబ్దం చేస్తున్నది కోటిలింగమే. అతను మగ్గంగుంటలో కూచునివున్నాడు గట్టుమీద దీపంవున్నది అతనిచేతిలో కబెల చీల్చే పెద్ద మొద్దుకత్తి వున్నది. మగ్గ

(55 వ-పేజీ చూడండి)

# జీడేలు

"ఒదినా! నాలుగు వంకాయలున్నాయిటమ్మా? అర్థంతరంగా ఒక చుట్టం దిగాడీవేళ...సాయంత్రానికి గానీ ఆయనగారు రారు...ఎవరింటి కెళ్లినా అయ్యవార్లంగారి నట్టిల్లేగదా! ఉత్త నిప్పచ్చ మొహాలు..మనిళ్లల్లో తప్ప అంతా ముందరే మొండిచెయ్యి చూపించేస్తారు!" అంటూ వచ్చింది ఎదురింటి వెంకాయమ్మగారు.

"ఏమిటో, ఒదినా! కరువుకాలం గదా! కాలక్షేపం చెయ్యాలిగానీ మరి..." అని మందలించింది మాణిక్యమ్మగారు.

"అయినా, ఏమిటి! మరీ అంత మోటుతనమా? మొన్న పిల్లి పాలు త్రాగేసింది గదా అని వెనకవీధివారింటికి మజ్జిగకెడితే, వాళ్ళమ్మాయి 'ఒక్కపూటకి మజ్జిగ లేకపోతే యేం! మరణిస్తారా!' అనడిగింది. మళ్ళీ గుమ్మం తొక్కమనుందా చెప్పు? అవసరం గనుకనూ...పాడిగలవాళ్ళు గదా వనిగానీ...లేకపోతే చస్తే అడుగుతామటమ్మా? మ్రగ్గి మాడిపోవలసిందే గానీ! పాడికి దిష్టితగులుతుందని ఎవరికీ ఇంత మజ్జిగచుక్కైనా పొయ్యరమ్మోయ్! అంతా కుడితితొట్టిలో పోసుకుంటారుగానీ చంటిపిల్లకైనా ఇన్నిచుక్కలు పొయ్యరు. కల్పవృక్షంలాంటి మీరు కనికరించబట్టి గానీ?..."



"ఏమిటో ఒదినా! కలిగితే కాసిన్ని పొయ్యటానికి కఱవా! ఇదిగో వంకాయలు...పెరుక్కి గిన్నె తెచ్చుకోలేదూ! పోనీగానీ...మళ్ళీ గిన్నెమాత్రం వెంటనే పంపేం?"

"అయ్యో! ఎంతమాటన్నావు?" అని అమృతవాక్కు లాలాపించి నెమ్మదిగా నడిచింది. వెంకాయమ్మ"

వెంకాయమ్మగార్ని సాగనంపాలని సావిట్లో కెళ్లేటప్పటికి గుమ్మంలో గుఱ్ఱబ్బండి చప్పుడైంది. తెరిచిన తలుపు తెరిచినట్లే ఉంచేసి వచ్చినచుట్టాల్ని ఆహ్వానించింది. బండిదిగి "ఏమమ్మోయి, అత్తయ్యా! జ్ఞాపకమున్నామా?" అని పలకరించాడు అతిథి.

"ఏమిటోయ్, ఇలా దిగావ్! ఇంటి దగ్గరంతా క్షేమమేనా" అని కుశల ప్రశ్న వేసింది మాణిక్యమ్మగారు.

"అదిగో, అమ్మ, అక్కయ్య అందరూ దిగారు."

"ఏరీ? ఏమిటి విశేషం? ఎన్నడు రానివారు..."

"రాకేం? నేం ఎప్పుడూ వస్తూనే ఉన్నాం...నువ్వే ఎప్పుడూ కూపస్థమండూకంలా కదలవు గానీ. అమ్మకి అజీర్ణం, అక్కకి కడుపునొప్పిట ఆస్పత్రిలో జాయిన్ చేద్దామని..."

ఇంతల్లోకే ఆడబడుచు తోటికోడలు రాజమ్మగారు, ఆవిడ అమ్మాయి అలివేలు అడుగుపెట్టారు. అందర్నీ ఆనందంతో ఆహ్వానించింది మాణిక్యమ్మగారు. భోజనాలుచేసి తాంబూలాలు నములుతూ కాలక్షేపానికి ఉపక్రమించారు. బంధువులు.

"ఏమిటండీ ఒదినగారు! అమ్మాయికి సుస్తీ ఏమిటి?"

"కాపరానికివెళ్లి పదేళ్లైందా, కడుపుని నాలుకాయలు కాయకపోతే మానె కడుపునొప్పి పట్టుకుందమ్మా. ఆ మాయ కడుపునొప్పొస్తే కన్నూ మిన్నూ ఎరక్కుండా గిజగిజ లాడిపోతుంది బిడ్డ. ఆస్పత్రిలో చేర్చి ఆపరేషన్ చేయించాలని తీసుకు వచ్చాను. చేబ్రోలుకి కొత్త చేరువగదా అని మనవాళ్లున్నారు గదా అని ఇక్కడే చేయించా లనుకుంటున్నాను. రెండు నెలలుండాలాయె ఏ సత్రం ఏర్పాటు చేసుకోవాలో చెప్పు......"

"అయ్యో! ఎంతమాటన్నారు!! ఏం పట్టుకుపోతాం చెప్పండి వదినగారూ! మీ ఎత్తుధనం పోసినా మీరు మాయింటి కెందుకొస్తారు చెప్పండి! ఈ నెలలో మా అమ్మాయికి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాము కూడానూ. మీరుగూడా ఉండి ముద్దూ ముచ్చటా చూసి మాకు సహాయపడగలరు గదా అని సంతోషిస్తున్నాను."

"మీ ఆదరాభిమానాలుండాలి గానీ దాని కేమిటి!"

ఇంతల్లోకే "పిన్నీ! పిన్నీ!!" అని పంతులు పిలిచాడు.

"ఏమిటోయ్; పంతులూ! తిండీ తిప్పలూ లేకుండా అదే తిరుగుడా చెప్పు! గంట రెండైంది. కడుపుమాడు ఎలా అప్పుడంలా అంటుకుపోయిందోనూ! కోడికూతకి బయలుదేరావు. అపరాహ్ణం తిరిగినా ఆహారం లేకుండా ఏం తిరుగుడు?" అని ఆదరించింది మాణిక్యమ్మగారు.

"ఔను పిన్నీ! ఎంత తిరిగినా అంతు లేకుండా ఉంది ఈ ఉద్యోగసమస్య. స్కూలుఫైనలు ప్యాసై అప్పుడే ఐదేళ్లైంది. ...శని నెత్తిమీద తంతూంటే?...భాగ్యవంతుల్ని పాడుచేసిన వాళ్లూ నిర్భాగ్యుల్ని బాగుచేసే వాళ్ళుంటారా ఈ ప్రపంచంలో ...ఈ ఉద్యోగం కోసరం ఈ వేళటికి ఈడొచ్చి ఆర్నెల్లైంది. కానీ...ఎక్కడా... ఖాళీలు లేవనే కబురు. ఆఖరుకి బస్సు కండక్టరుఉద్యోగానికి బయలు దేరాను. మూడునెల్లనుంచీ వెట్టిచాకిరీచేసి ... పట్టరానివాళ్ళ కాళ్ళు పట్టుకుని...పెళ్ళాం పుస్తె అమ్మి లైసెన్సు తెప్పించుకుంటే... బ్రాహ్మణుల కివ్వమన్నారు. ఆఖరికి అధికారిచుట్టూ తిరగ్గా తిరగ్గా ఇరవైరోజుల నుంచీ తిప్పితిప్పి ఈ వేళ డిపాజిట్ నూటయాభై రూపాయలు ముందెవరుకడితే వాళ్లకిస్తానని వాగ్దానం జేశాడు. రేపు మధ్యాహ్నం పన్నెండుగంటలలోపుగా ఎవరు ముందరకడితే వాళ్ళదే ఛాన్సుట. ఇంటికి వెళ్ళడానికికూడా వ్యవధి లేదు. వెళ్ళినా...వెంటనే డబ్బు దొరుకుతుందని నమ్మకమేమిటీ? ... ఇప్పటికే నాన్నకి ఊరంతా అప్పు. ఇంకెలా అప్పు పుడుతుంది? దొరక్క దొరక్క ఆ కొస్త... అంత గొప్ప ఉద్యోగం దొరుకుతే దానికైనా కక్కుర్తి పడడానికి దారిలేక పోతూంది. తెల్లవారితే తన్నుకుపోదామని గద్దల్లా కనిపెట్టుకు కూర్చున్నారు. డబ్బుకోసరం భగీరథప్రయత్నాలు సాగిస్తు

న్నారు. దరిద్రదేవతకి దాహం ఎక్కువై పోయి దాసుల్ని దహనం చేసేస్తోంది. ఉద్యోగానికి ముందర లంచం యాభై, తర్వాత డిపాజిట్ నూటయాభై. మిమ్మల్నే కాళ్ళు పట్టుకోడం తప్ప నాకు వేరేగతి లేదు. ఆ కాస్త పుణ్యంకట్టుకుని మమ్మల్నుద్ధరించావా?...నీపేరు చెప్పుకుంటాం. ఒక ఇల్లు నిలబెట్టినదాన వౌతావు......" అని దీనాలాపాలు ఆలపించాడు. మాణిక్యమ్మ గారి జ్ఞాతి పంతులు. "నాయనా పెద్ద నాన్నగార్ని అడగలేకపోయావా?"

"చిటిపెళ్ళి తలపెట్టుకున్నారు గదాని సిగ్గేస్తోంది పిన్నీ! ఇప్పటికి ఉద్యోగం వంకతో ఐదారుసార్లు ఐదారు వందలు తగలేశాను...ఏ మొహం పెట్టు కడుగనూ...?"

"అయినా పెద్దనాన్నగారు ఎల్లుండి దాకా రారు...సరేకానీ...ఇదిగో ఈ జిగినీ గొలుసు తాకట్టుపెట్టి రెండువందలు తెచ్చుకో... పెద్దనాన్నగారు వచ్చాక అడిగి యిస్తాను, విడిపించేద్దువుగాని..." అని ఆరు కాసుల జిగినీగొలుసు పంతులికి అర్పించింది మాణిక్యమ్మగారు.

"పిన్నీ! నీ ఋణం తీర్చుకోలేనమ్మా నా చర్మం చెప్పులు కుట్టియిచ్చినా! నా మొదటి జీతం నీకే బహుమతి...నువ్వు మా పాలిటి కామధేనువు. మా కులవేల్పువి. ఈసారి మాకు అమ్మాయి పుడితే నీ పేరెట్టు కుంటాను" అని కళ్ళనీళ్ళతో కాళ్ళుపట్టుకుని నీతివాక్యాలతో నిష్క్రమించాడు నిర్మొహమాటంగా పంతులు భోంచేసి.

బాపిరాజు గారు ప్రసిద్ధికెక్కిన ప్లీడరు ఆ ఊళ్ళో. పిత్రార్జితం పిసరంతైనా లేకపోయినా ప్రాక్టీసు బాగుండడంవల్ల భాగ్యవంతుడు కాగలిగాడు. ఆయన పెద్ద కుటుంబీకుడు కాకపోయినా భాగ్యవంతుడవడం వల్ల, బంధువర్గమంటే బాధ్యత నెత్తిన పెట్టుకోవడంవల్ల బంధువర్గాని కెక్కడా ఎడబాటంటూ ఉండేదికాదు. అన్నపూర్ణ సత్రంలాగ ఎప్పుడూ గడప ఎక్కేవారికి దిగేవారికి ఎడతెరిపి లేకపోయేది.

వారాల బ్రాహ్మల కెక్కడా నాగా ఉండేదికాదు. బీదవిద్యార్థులకి జీతాలు కట్టేవారు. బాపిరాజు గారి ఆర్జనకి మాణిక్యమ్మ గారి చాకిరీకి చుట్టాలరాకకి విసులు విరామము ఉండేదికాదు. ధర్మసత్రంలాగ ధన సత్రంలాగ ధనవంతులు, దమ్మిడీ లేనివాళ్లు, ఉద్యోగాలకోసరం వచ్చేవాళ్ళు, పెళ్ళిళ్ళ విషయమై వచ్చేవాళ్ళూ, రోగాలకొచ్చే వాళ్ళు, చదువులకొచ్చేవాళ్ళూ అందరూ కనబడేవాళ్లు. వంటవాళ్లు వడ్డిస్తూవుంటే షడ్రసోపేతంగా పంచభక్ష్య పరమాన్నాలు భుజిస్తూ, నిరంతరం నిప్పుమీద మరుగుతూన్న నీళ్ళతో అభ్యంగన స్నానాలాచరిస్తూ, హంసతూలికా తల్పంమీద శయనించి ఆనందిస్తూ అవసరాలు గడుపుకునే వారు.

ఆయన ఏకైక పుత్రిక చిట్టిపెళ్ళి నెల్లాళ్ళకి ముందునుంచి నిలవయ్యారు చుట్టాలు. ఇల్లు క్రిక్కిసలాడుతూ, బంధువులతోటి, చుట్టాలతోటి కిటకిటలాడుతూంది. ఆనందంతో అతి వైభవంగా పెళ్ళి జరిగింది. శీతాకల్యాణంలాగ వీధికి పందిళ్లేసి విస్తళ్ళు కట్టారు. ఆరు గ్రామాలనుంచి బ్రాహ్మణ వర్గం, ఘనాపాఠీలు, పనసలు చదువుకుంటూ, కుండలా లాడించుకుంటూ, శాలువ లెగదోసుకుంటూ, ముక్కుపొడుం పీల్చుకుంటూ, చేతికఱ్ఱ లాడించుకుంటూ, విభూతి పట్టీలుతీర్చి, బిళ్ళగోచీ లమర్చి, గుండెలనిండా గంధపుపూతలు పెట్టి, రుద్రాక్షలు గుండెలమీద నాట్యం చేస్తూండగా, తాటాకువిసనకఱ్ఱలతో విసురుకుంటూ తాంబూలాలు నములుకుంటూ, ముక్కుమాటలాడుకుంటూ బయలుదేరివచ్చి కల్యాణ మండపం అలంకరించారు. ఎవరికి దొరికిన సరకు వాళ్ళు తీసుకుపోతున్నారు.

వచ్చిన చుట్టాలంతా సుమారు నెల్లాళ్లకు పైగా మేసి పట్టుపుటాలు ధరించి పి వంటలతో సహా తిని వీరెల్లు గుల్లచేసి కదిలారు; అక్షింతలు వారి నెత్తిమీద ... చుట్టాలకి చుట్టలందలేదని, బంధువులకి లెటలేదని, ఇరుగు పొరుగువారికి పిలుపు ... లేదని కుళ్ళుమాటలాడారు. ఎవళ్ళకం... పెత్తనం వాళ్ళు చెలాయించారు. "చు...ల్నంతా ఎందుకలా చేరదీస్తాడు? పోత తినిపొయ్యే చుట్టాలేగానీ అక్కరకో వాళ్ళెవరేనా ఉన్నారా? ఉన్నన్నా... ఒళ్ళెరగకుండా విరజిమ్మకోవడం, తరా... కాళ్లుచాచుకు కూర్చుంటే ఎవరుద్ధరిస్తా... కాస్త వెనకాముందూ చూసుకోవాలి" బాపిరాజుగారి మేనమామ గొంతుక బ... చేసుకున్నా, అది అరణ్యరోదనమయి... అసూయాపరులానందించక పోయి... ఆత్మబంధువులు అక్షింతలు జల్లి... కార్యం నిరాఘాటంగా నిర్వర్తించా... పెళ్ళికెళ్ళిన పెద్దలంతా ఆ నెల్లా... పెళ్ళివిగురించే ప్రస్తావన చేశారు.

"మాణిక్యమ్మగారు మహా యిల్లాల... నమ్మ."

"మహా యిల్లాలేమిటి! మణిపూసలా

(55 వ-పేజీ చూడండి)

# కొంప కోసం

"ఒక్క కాలుగడుగులు పడవటానికి ఓపిక తెచ్చుకో బ్రదర్, ఈ కొంప కూడా కనుక్కొని వెనక్కి తిరుగుదాం."

సూర్యనారాయణ బతిమాలుతున్నట్టుగా అన్నాడు. రామారావు పరిస్థితి చూస్తే అతనికి జాలి వేసింది.

"లాభం లేదోయ్. ఇంక ఒక్క అడుగు ముందుకి పడినా మనకి అక్కడే సమాధి కట్టాలి వొస్తుంది."

ఆ సమయంలో సూర్యనారాయణకే కాదు, రామారావు మొహం చూస్తే ఎంత కర్కశహృదయుడికైనా జాలి కలుగక మానదు.

"పాడువది ఇంత మహానగరంలో ఓ చిన్న కొంపకోసం ఎన్ని అగచాట్లు పడాలి వొస్తోంది" రామారావు నిట్టూరుస్తూ అన్నాడు, "అసలు ఎవరినైనా ఒక వూరి నించి మరో వూరికి ట్రాన్స్‌ఫర్ చేసేటప్పుడు అవతలివూరిలో అతనికి కావలసిన కొంపా, గోడూ మొదలైన సదుపాయాలు చూపించి గానీ మరీ చెయ్యకూడదంటాను."

గోడపక్కనున్న ఓ చెట్టుకిందికి చేరి సేదతీర్చుకుంటూ అన్నాడు సూర్యనారాయణ, "నిజమే, కాని మన మొరాలకించే దెవరు?" మళ్ళీ ఓ నిట్టూర్పు విడిచాడు రామారావు.

ఇద్దరూ మౌనం వహించటంతో కాసేపు నిశ్శబ్దం ఆవరించింది.

"ఇంతా విడిస్తే ఆ ఇల్లైనా ఖాళీగా వుందో, లేదో."

ఉండకపోతే తన గతేమికాను, అన్నట్టుగా రామారావు మాటలు ధ్వనించాయి.

సూర్యనారాయణ విషాదంగా ఓ నవ్వు నవ్వాడు.

"ఏది ఏమైనా ఈసారి చూడబోయే ఇల్లు సాధించి తీరాలి." మనసులో దృఢంగా నిశ్చయించుకున్నాడు సూర్యనారాయణ.

రామారావు ఒకానొక గవర్నమెంటు ఆఫీసులో ఓ ఎస్. జి. వో. సూర్యనారాయణ అతని స్నేహితుడు; తోటి గుమాస్తా. ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ చేతిలో పట్టుకుని విషాద వదనంతో రామారావు అతని దగ్గరికి వెళ్ళి "ఇంతకాలంనించీ ఇక్కడ స్థిరపడ్డ మనకి పరాయివూరిలో కావలసిన 'ఫెసిలిటీస్' ఎలా దొరుకుతాయో నాకేమీ బోధపడ్డం లేదోయ్" అంటే "మరేం పర్వాలేదు నీక్కావలసిన సదుపాయాలన్నీ సమకూర్చుకోటానికి నేను సహాయపడతాగా" అన్న హామీ ఇచ్చినవాడు ఆ వూరితో కొద్ది పరిచయంగల సూర్యనారాయణ.

"ఇంకా సంసారభారం ఓటి నెత్తిన పళ్ళేదు నయం. అదికూడా వుంటే మన పని ఎలా వుండాలో అలా వుండేది."

మళ్ళీ చిన్నగా నవ్వాడు సూర్యనారాయణ.

వాళ్ళిద్దరూ ఈ వూరు చేరి అద్దమైన గడపా ఎక్కి దిగారు. కాని వాళ్ళకి కావలసిన ప్రయోజనమటుకు ఫలించలేదు.

## మతుకుమిల్లి ప్రభాకరరావు

"ఈకాలంలో ఏదైనా 'జాబ్' సంపాదించటం ఎంత కష్టమో ఓ చిన్న అద్దెఇల్లు సంపాదించటం కూడా అంత కష్టమేనని ఇప్పుడు స్పష్టపడుతోంది."

భవిష్యత్కార్యక్రమాన్ని గురించి ఆలోచిస్తున్న సూర్యనారాయణ రామారావు మాటల్ని సరిగ్గా మనసుకి పట్టించుకోలేదు.

రామారావు ముఖంలో అకస్మాత్తుగా ఓ కిరణం మెరిసింది.

"ఈ ఇల్లూ ఖాళీగా లేకపోతే 'ఫామిలీ'కి గాని ఇవ్వమన్న కొత్తపేటలోని ఇంట్లో 'ఓ నెల రోజుల్లో సంసారాన్ని తీసుకొస్తా'మని చేరదామా ఏమిటి?

సూర్యనారాయణవైపు చూస్తూ అడిగాడు రామారావు.

"తర్వాతైనామటుకు లేని సంసారాన్ని ఎక్కణ్ణించి తెస్తావ్?"

"ఆ నెల రోజుల్లోనూ మరో రూము దొరక్కపోతుందా?"

ఇద్దరూ ఒక్కసారిగా నవ్వారు.

* * *

"ఎవరండీ ఇంట్లో."

ఆరోసారి అరిచాడు సూర్యనారాయణ. అతఃపూర్వం పిలిచిన ఐదు పిలుపులూ గాలిలో కలిసిపోగా కలిగిన కోపంతో అతని స్వరం స్థాయి పెరిగింది.

"ఎవరు?" అంటూ ఓ లావుపాటాయన తువ్వాలుతో మూతి తుడుచుకుంటూ ప్రవేశించాడు.

"నల్లజెర్ల సుబ్బారావుగారని, మీ కెరిగే వుంటారు."

సూర్యనారాయణ ధోరణిచూసి రామారావు కాశ్చర్యం వేసింది. కొంప ఖాళీగా వుందో లేదో కనుక్కోటానికి తన పుట్టుపూర్వోత్తరాలన్నీ ఏకరువు పెట్టటం దేనికి? అనుకున్నాడతను.

"ఎవరూ?" అనుమానంగా అడిగాడాయన. ఇంటి యజమాని మెదడులో ఏవో భావాలు కదిలాయి. కొంపతీసి వీళ్లు ఎవరో చుట్టాలు కాదుగదా తన పీకలమీద కూచోటానికి!

"ఇతనూ వారబ్బాయి. బి. ఏ. పట్టా పుచ్చుకుని ప్రస్తుతం నౌకరీ చేస్తున్నాడు."

రామారావు అతని వంక నిర్ఘాంతపోయి చూస్తున్నాడు.

"అలాగా!" అన్నాడు ఇంటాయన. ఇంతకీ వొచ్చిన పనేమిటో తేల్చడేం అనుకుంటూ.

"చాలా బుద్ధిమంతుడు, అంతా ఇతన్ని చూసి 'భేష్' అన్నవాళ్ళేగాని..."

"ఓహో" అన్నాడు ఇంటియజమాని ఎంతో ఓపిక తెచ్చి పెట్టుకుంటున్నట్టు.

"అన్నట్టు ఈ ఇల్లు ఖాళీగానే వుంది కదండీ."

"ఏదీ, అబ్బే..."

"అసలు సుబ్బారావుగారే స్వయంగా వచ్చేవారండి. కాని ఆఖరి క్షణంలో ఏదో అవాంతరం వొచ్చి ఆగిపోయారు కానీ. 'నాపేరు చెప్పవోయ్, పంతులుగారు తప్పకుండా ఇస్తారు' అని చెప్పారండి. వారు చిన్నప్పుడు మీతో కలిసి చదువుకున్నారటగా."

"చదివే వుండొచ్చు. కాని......నాకంతగా గుర్తులేదు. చూడూ, మతిమరుపు

(39-వ పేజీ చూడండి)



# విజ్ఞాన వీధులు

"డాక్టర్"



## 165. కొలంబస్ గొప్పతనము

"ప్రాచీన భారతీయులు హిందూ మహా సముద్రములోని జావా, బాలీ వంటి ద్వీపములను కనిపెట్టి ఆ దేశీయులతో నౌకావర్తకము చేసినారుగదా, మరి ఇటలీ దేశీయుడైన కొలంబస్ సుమారు ఎనిమిది వందల సంవత్సరాల తర్వాత అమెరికాను కనుక్కొన్నాడని అతని కెందుకూ అంత గొప్పతనము ఆరోపిస్తున్నారూ?" అని ప్రశ్న.

అవును. క్రీస్తుశకము ఆరవశతాబ్దములో కళింగదేశమునుండి విజయుడు సైన్య సన్నాహముతో ఓడలమీద సింహళద్వీపమును జయించబోయి కృతకృత్యుడైనాడు. కళింగులు జావాద్వీపమును జయించి అందులోని పర్వత శిఖరానికి 'గాలుంగ గంగ' అని క్రీ. శ. 1077 లో రాజ్యాభిషిక్తుడైన గాంగరాజు పేరు పెట్టినారు. క్రీ. శ. నాలుగో శతాబ్దములో తెలుగు దేశము నేలిన యజ్ఞశ్రీ శాతకర్ణిని చీనా చరిత్రకారులు 'యజ్ఞాయ్' అని పేర్కొన్నారు. ఫాహియాన్ సింహళములో ఓడ నెక్కి చీనాకు తిరుగు ప్రయాణము చేసినాడు. నాడు భారతీయులూ ప్రాచ్యదేశీయులూ నౌకాయానములో పాశ్చాత్యులకు తీసిపోలేదు.

కొలంబస్ గొప్పతనము నౌకాయాత్రలోనూ కాదూ, ఇదివరకు తెలియని కొత్త దేశాన్ని కనుక్కొన్నాడనీ కాదూ. అతని రోజులలో పాశ్చాత్యదేశాల వర్తకులు భారతదేశముతోనూ, చీనాదేశముతోనూ నౌకావర్తకము చేసేవారు. వర్తకమనగా నేసరుకులూ, వాటి రవానా, వాటి భద్రతా, ఇవన్నీ అవసరము. సూయజ్ దగ్గరా, మధ్య ఆసియాలోనూ పాశ్చాత్యుల బిడారుకు ఏదో అల్లరీ ఆటంకమూ కలుగుతూండేవి. నేలమార్గాన్ని విడిచి సముద్రమార్గాన్న భారతదేశానికి దారి కని పెట్టిన వాస్కోడగామా ఈ నష్టము కలగకుండా చేశాడు గాని, యూరప్ నించి ఆఫ్రికా అంతా 'అసావాదిత్యో బ్రహ్మ' అన్నట్టుగా చుట్టిరావడమువల్ల అనవసరపు కర్చు తగులుతునేది. కొలంబస్ ఈ నష్టము లేకుండా చెయ్యాలని ఆలోచించాడు. ఆ రోజులలో కొత్తగా 'భూమి గుండ్రముగా ఉన్నదని' కనిపెట్టేరు. కొలంబస్ ఆలోచించాడు: 'భూమి గుండ్రముగా వుంటే, భూమిని నౌకాయానము చేస్తూ చుట్టి రావచ్చునుగదా? అయితే, యూరపు నుంచి తూర్పునకు అంతకాలము ప్రయాణము చేస్తేనేగాని రాని భారతదేశము, యూరపునుంచి పశ్చిమానికి ప్రయాణిస్తే అంతకన్న త్వరగా రావచ్చునుగదా?' అని. ఇలా ఆలోచించి, అష్టకష్టాలూ పడి ఓడ సంపాదించి ఖైదీలను నావికులుగా తీసుకుని అట్లాంటిక్కు సముద్రములో పశ్చిమంగా బయల్దేరాడు. భూమి బల్లపరుపుగా ఉన్నదనే అపోహ నావికులకు పోలేదు. వళ్ళి వళ్ళి, భూమి అంచున దభీమని ఓడ పడిపోతుందని వారు జడిసి, ఒకనాడు కొలంబస్‌ను చంపుదామని కూడా తీర్మానించారు. అతడు పసిగట్టి మరిమూడు రోజులు మాత్రం సాగిపోదామన్నాడు. అదృష్టవశాత్తూ, కొట్టుకువచ్చే రెమ్మలూ, పక్షులూ దీవులలో దీపాలూ కనపడ్డాయి. భూమి గుండ్రంగా వున్నదన్న శాస్త్రవిజ్ఞానాన్ని ఒకరకంగా నిరూపణచేశాడు కొలంబస్. అజ్ఞాత సముద్రాలలో కొత్త దీవుల్ని కనిపెట్టినందుకు కాదు కొలంబస్‌కి ధన్యవాదాలు. శాస్త్రవాదమునకు ఉపపత్తిని కనిపెట్టినందుకు; వైజ్ఞానిక పరిశోధనల సత్యాన్ని నిరూపించినందుకు. (అయితే కొలంబస్ కనిపెటినది భారతదేశము కాదు. అతని సిద్ధాంతము మాత్రమే నిజమైంది గాని కోరిక సఫలము కాలేదు.) ★

## చిట్టిప్రశ్నలకు జవాబులు

—అవును. ఒంటెలకున్న మూపురముల లోని తిత్తులలో అవి నీటిని నిలవచేసుకుని మూడు నాలుగు రోజులదాకా నీరు త్రాగ నక్కరలేకుండా ప్రయాణము చేయగలవు. ఒకొక్కప్పుడు ప్రయాణీకులు నీటియెద్దడి వల్ల ప్రాణరక్షణకు ఒంటెలను చంపి ఈ నీటిని త్రాగుటకూడ కద్దు. దక్షిణ అమెరికాలోని అరిజోనా ఎడారిలోని కాక్టసు ముళ్ళచెట్లను నరికి, కాండములోని ముద్దను పిసికి గొట్టములతో రసమును పీల్చుకు తాగడముకూడా మామూలే. ఆస్ట్రేలియా యెడారులలో ఒక జాతి కప్పకు పెద్దపెద్ద మూత్రాశయము లుంటాయిట వాటిలో నిర్మలమైన నీరుదాచుకుంటాయట ఆ కప్పలు. ఆదిమవాసులు ఈ నీటినితాగి ఒక్కొక్కప్పుడు దాహము తీర్చుకుంటారట.

—ఓమర్ ఖయామ్ పర్షియాలోని నైషాపూరువాసి. పదకొండవ శతాబ్దము వాడు. రుబాయీలనే చార్వాక సిద్ధాంతపు కవితలేకాక బీజగణిత శాస్త్రములో కూడా గ్రంధరచన చేశాడు.

—అంతటా పెరిగే ఎక్కువ విలవైన పంట, పైరు, ఏది? అని అడిగితే 'గడ్డి' అని చెప్పాలి. పెంపుడు జంతువులు చాలా మట్టుకు గడ్డిమీదే ఆధారపడతాయి. ఇంగ్లాండులో గడ్డి ప్రత్యేకము పైరుచేస్తారు. మనము గడ్డిని అసలే పెంచక పశువులను కడుపుమాడ్చి చంపుతాము.

—ఉప్పునీళ్ల సరస్సులు సామాన్యంగా ఎడారులలో ఉంటాయి. ఈ సరస్సులలోని నీరు మరి పైకి ఎక్కడికీ ప్రవహించదు. ఆ ప్రదేశాలలో వర్షపాతము ఎక్కువగా ఉండకపోవడమువల్ల ఈ సరస్సులలోకి నీరు ధారాళంగా ప్రవహించి, వాటిని నింపి, పొర్లిపోదు. ఆ సరస్సులలో చేరే నీరు కొద్ది. కనక ఈ నీటితోపాటు ఆ సరస్సులలో చేరే ఉప్పులు పలచబడడానికి వీలులేదు. ఎండకి నీరు ఆవిరి అయిపోతూంటే ఉప్పునీరు చిక్కబడుతూంటుంది. కొత్తనీరు కొంతచేరి, మళ్లీ వేసంగిలో ఇగిరిపోతూంటుంది. ఇలాగ జరగ్గా జరగ్గా ఆ నీరు ఉప్పన ఎక్కువౌతుంది.

ఇగిరిపోడము జోరైతే, సరస్సులు ఉప్పుపేలి, పొరలుపొరలుగా ఉప్పుగా మారిపోతాయి. మన దేశములో సింధుప్రాంతంలో సైంధవలవణము దొరుకుతుందంటారే, ఇలాగ ఏర్పడినదే. నెమ్మదిగా నీరు ఇగరడముచేత ఉప్పుస్ఫటికాలు పెద్దవిగా తయారవడానికి వీలిచ్చింది.

మంచుకొండలలో ఉన్నవన్నీ మంచినీళ్ళ సరస్సులే, ఎందుచేతనో ఊహించుకోండి?

—'పిల్లలు కథలు చెప్పినప్పుడు ఎందుకు అంత ఆసక్తిగా వింటారూ?' అంటారా? పిల్లలకిగాని, పెద్దలకిగాని కొత్త అనుభవాలంటే చాలా ఇషము. పెద్దలకి ఒక అనుభవము స్వయంగా జరిగితేనేగాని నమ్మకముండదు. పిల్లలకి వింటూంటేనే ఆ విన్న విషయాలు అనుభవములో చేరిపోతూంటాయి. అందుకే జాలి కథచెప్తే ఏడ్చేస్తారూ, రాక్షసుడి కథ చెప్తే కలవరిస్తారు. కొత్తఅనుభవాల్ని పొందే ఆసక్తే కథలు వినే ఆసక్తి. పెద్దవారయినకొద్దీ అసలు అనుభవాలకీ, ఈ కథానుభవాలకీ వారా దూరమౌతుంది. వింటే ఎక్కని అనుభవాలు చదివితేనూ, ఇంకా వయసు పెరిగినతర్వాత (రంగస్థలంమీద) చూస్తేనూ ఎక్కుతాయి. నాటకం చూచినా అనుభవము అందని వారు బాలకులు కారంటే చాలదు. మానవులే కొరనాలి.

—కేవలము చెట్లమీదే నివసించే ప్రాణుల రకాలు దక్షిణ అమెరికా అడవులలో చాలావున్నాయి. తోకల్ని కొమ్మలకి చుట్టపెట్టి వ్రేలాడగల కోతులూ పిల్లులూ, నేలమీద బాగా నడవలేవు. వాటి కాళ్ళూ చేతులూ కొక్కెల్లాగ పనికొస్తాయి! చెట్లమీదే బతికే ఉడుతలూ, ఏదుపందులూ కూడా ఉన్నాయి. చెట్ల కప్పలున్నాయి; అవులకి వెనకపక్కన బల్లులలాగు అంటిపెట్టుకుంటాయి. చెట్ల కొమ్మలకి తోక చుట్టపెట్టి ఎరకోసము ఊగిసలాడే కొండచిలువలున్నాయి. పళ్లు మాత్రమే తిని జీవించే గబ్బిలాలూ ఇతర పక్షులూ ఉన్నాయి.

—జావాద్వీపము ఇంగ్లండూ వేల్సూ కలిసినంత వుంటుంది.

—అగ్నిపర్వతాలు పర్వతాలుగా ఎందుకుండాలంటారా? అక్కరలేదు కాని ఏపగులులోనించో భూగర్భమునుంచి పైకి చిమ్మబడిన లావాద్రవము అన్నివైపులా పారి దల్లారి కొండలాగ తయారుచేస్తుంది. అంతేగాని కొండలలోనించే అగ్నిద్రవము రావాలన్న నియమము లేదు.

ఆ సరస్సుల్లో చేరే నీరు ఆట్టే లవణములను కరిగించుకోలేదు కొంచెం దూరమే ప్రవహించి సరస్సులో చేరుతుంది కనక. ఇక, ఆ సరస్సులు సులువుగా నిండి, పొర్లిపోవడములో ఆకాసిన్ని ఉప్పులూ తప్పుకుపోతూ వుంటాయిగాని చిక్కబడవు.

—తీరని కోరికలను పెంచుకుంటే ఆ కోరికలను గురించిన కలలువస్తాయి. నిండు కడుపుతో పడుక్కుంటే ఒత్తిడివల్ల తిండికీ, దాహానికీ సంబంధించిన కలలు రావచ్చును. ఒకొక్కప్పుడు ముందు జరగబోయే సంగతులు కలలో రావచ్చును. సామాన్యంగా 'కలలు' మన ఆశలను కలబోసుకున్నట్లు వస్తాయి. 'కల' మనస్సులోని దృశ్యము కనక అనుభవాలుకూడా సామాన్యానుభవాలలాగే వుంటాయి. జంతువులకు ఆలోచనలూ ఆశలూ వుంటే కలలు రావచ్చును అన్నారావుగారూ.

—చంద్రరశ్మి సూర్యరశ్మియే. చంద్రబింబముమీద పడి పరావర్తమైనది, అంతే. చంద్రరశ్మిని గాజుపట్టకముతో విశ్లేషిస్తే సూర్యరశ్మిలో ఉన్న రంగులే, ఆ పాళ్ళలోనే కనబడతాయి. చంద్రకిరణాలు కాంతి తగ్గిపోయిన సూర్యకిరణాలే. చీకటిలో చిక్కుడు గింజల్ని మట్టితొట్టిలో నాటి పెంచిన చిన్న మొక్కలు పసుపుపచ్చగా తయారౌతాయి. వాటిలో కొన్నిటిని వెన్నెలలో పెట్టినట్లైతే కొంత ... పచ్చగా తయారౌతాయి. అంటే *Pho...* *Synthesis* జరిగిందన్న మాటే కదా?

పిశాచాన్ని పారద్రోలే నృత్యం.



← జావాలోని మధ్యతరగతి స్త్రీ.

బాలీలో పురుషులు పాల్గొనే నృత్య





బాలీద్వీపంలో
సాలూరు అనేచోట
సముద్రపుటొడ్డున
శివాలయం.

# జావా, బాలీ ద్వీపాలు



(ఫొటోల సేకరణ :
దేశిరాజు వెంకటకృష్ణశర్మ;
గుంటూరు.)





క్లుంగ్ కుంగ్ (బాలీద్వీపం) పట్టణానికి సమీపానగల గుహ. ఇందులో శివపార్వతులు, విఘ్ననాయక, చతుర్ముఖబ్రహ్మం శిల్పాలువున్నాయి,






# ★ కాగితపు పడవలు ★

శ్రీ|| కోటి



వర్షాకాలము వరదలఁ
నిండుగ పారే కాలువలో
కాగితాలతో పడవలు చేసీ
రంజు రంజుగా వదిలేస్తా!

చిన్న పడవలూ, పెద్ద పడవలూ,
కొయ్య పడవలూ, కోల పడవలూ,
జంటపడవలూ, జోరు పడవలూ,
ఎన్నో రకముల పడవలు చేసీ
అన్నీ నీటిలో వదిలేస్తా!

పెద్ద పడవలవి, అమ్మా, నాన్నా,
చిన్న పడవలు మరి, నేనూ, చెల్లీ,
కొయ్య పడవలవి, అక్కా బావా,
అన్ని పడవలూ ఐకమత్యముగ
ఆడుతు, పాడుతు పోతాయి!

వీధులు దాటీ, వాడలు దాటీ,
ఊరులు దాటీ, ఏరులు దాటీ
ఎవరికి తెలియని ప్రదేశాల కవి
అల్లన, మెల్లన వెడతాయి!





(సీరియల్)

# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

R. L. STEVENSON



## 9

## డాక్టరు లాన్యను వివరించిన కథ

జనవరి తొమ్మిదవ తేదీని, అనగా నేటికి నాలుగు రోజుల క్రిందట, సాయంకాలపు తపాలా బట్వాడాలో నాకొక రిజిస్టర్డు కవరు వచ్చింది. దానిమీది చిరునామా నా చిరకాలసహాధ్యాయియు సహచరుడునైన హెన్రీ జెకిల్ దస్తూరిలో ఉంది. అది చూడగానే నాకు చాలా ఆశ్చర్యమైంది. ఎందువల్లనంటే మా ఉభయులకూ ఉత్తర ప్రత్యుత్తరాల అలవాటు ఎన్నడూ లేదు. అంతకు క్రిందటి రాత్రియే నేను అతనిని చూచాను. అతనితో కలిసి భోజనం చేశానుకూడా—కనుక రిజిస్టర్డుపోస్టుద్వారా వ్యవహార రీత్యా నాకు యిప్పుడు ఏవిషయమై యీకవరు ఉత్తరం వచ్చియున్నదో నిన్నటి మా సమావేశసంభాషణలను బట్టి ఊహించలేకపోయినాను. ఆ ఉత్తరంలోని విషయములు మరింత వింతగా ఉన్నాయి నాకు—. ఆ ఉత్తరం యీ క్రిందివిధంగా వుంది—.

10 డిసెంబరు 18... ప్రియమిత్రుడవైన లాన్యన్! నాకత్యంత చిరమిత్రులైనవారిలో జేరినవాడవు నీవు—. శాస్త్ర చర్చలలో మనకు అప్పుడప్పుడు భేదాభిప్రాయాలు వచ్చియుండినప్పటికీ, మన ఇద్దరి మధ్యనున్న అనురాగాభిమానముమాత్రము చెడినదని ఊహించుటకుతగిన సందర్భము ఏదిన్నీ నామట్టుకునాకు కన్పించడం లేదు. నీవు ఎన్నడైనా నాతో మాట్లాడుతూ, "జెకిల్! నా ప్రాణం, నా మానం, నావివేకం యివన్నీ నీమీాదనే ఆధారపడి వున్నాయి" అని నీవు అన్నట్లయితే, నా అయిశ్వర్యం అంతా నేను నీకోసం త్యాగం చేయజాలనటువంటి రోజుగాని, నీకు సాయంచేయడానికి నా ఎడమ చేతిని అర్పించడానికి సిద్ధం కానటువంటి దినంగాని ఎప్పుడూ లేదు. లాన్యన్! నా ప్రాణం, నా మానం, నా వివేకం యివన్నీ యిప్పుడు నీదయకు పాల్పడి ఉన్నాయి. ఈరాత్రి నీవు నాఆశ నిరాశచేస్తే నేను అంతరించిపోయినట్లే అవుతుంది. ఇంత ఉపోద్ఘాతం నేను వ్రాయడం చూచి, ఏదో అమర్యాదకరమైన కోరికను విన్నవించుకొనబోతున్నానని నీవుఊహిస్తావు. కాని, ఇదంతా పూర్తిగా చదివి బాగా యోచించు.

ఈ రాత్రికి నీకుగల యితరవ్యవహారములనుఅన్నింటినీ నిలిపి వాయిదా వేసియుంచవలెనని కోరుచున్నాను. మంచంపట్టిన ఒక మహారాజు వద్దకు రావలసినదిగా నీకు పిలుపు వచ్చినప్పటికీ, ఆపనికూడా వాయిదా వేయవలెను. నీకు సొంతబండీ, హాజరుగా గుమ్మంవద్ద ఉంటేనేతప్ప, ఒక కిరాయిబండీని మాట్లాడుకో. మన ఉభయుల సంప్రతింపుల నిమిత్తమై యీ కవరు ఉత్తరమును నీ జేబులో పెట్టుకొని సరాసరి నా యింటికి రావలెను. నా బట్లరైన పూల్‌కు యివ్వవలసిన ఉత్తరువులన్నీ అతనికి జారీచేశాను. నీ రాక కొరకై ఎదురుచూస్తూ, తాళాలు బాగుచేసెడి ఒక పనివానితోసహా అతడక్కడ వేచిఉంటాడు. అప్పుడు నా కచ్చేరీగది తలుపు తాళం మీారు బలాత్కారంగా తెరచుకొని లోపలికి రావాలి. నీవు ఒక్కడవు మాత్రమే లోనికి రావాలి. ఎడమచేతివైపున పింగాణీ పూత పూయబడిన "ఇ" అనే అక్షరం గల బీరువాను తెరువవలెను. అది మూయబడిఉన్నట్లయితే, తాళం కూడా పగులగొట్టాలి. నాలుగోసొరుగును దానిలో

మూలం : రాబర్ట్ లూయీ స్టీవెన్సన్  అనువాదం : దాసు వామనరావు



# మనిషిలో మనిషి



ఉన్న యావత్తు సరకుతోసహా బయటికి లాగవలెను. పైనుంచి లెక్కిస్తే అది నాలుగోసొరుగు. క్రిందనుంచి లెక్కిస్తే అదే మూడోసొరుగు—. నాకు యిప్పుడు ఉన్నటువంటి ఆవేదనలో, మతిస్థిమితము లేక, నీకు వ్రాయవలసిన వివరములను సరిగ్గా నేను వ్రాయడం లేదేమో అనే దిగులు నన్ను బాధిస్తోంది. నేను పొరబాటుగా వ్రాసినప్పటికీ, ఆ డ్రాయరుసొరుగు ఏదో దానిలోని సరకునుబట్టి నీవు గుర్తించవచ్చు. దానిలో కొన్ని చూర్ణాలు, మందుసీసా, కాగితాల పుస్తకం కన్పిస్తాయి. ఈ డ్రాయరుసొరుగును ఉన్నది ఉన్నట్లుగా కావెండిష్ చౌకునకు నీవెంట నీవు తీసికొనిపోవాలి.

ఇది నీవు నాకు చేయవలసిన మొదటి సహాయం. ఇక రెండోసహాయం ఏమిటో మనవిచేస్తా- ఈ ఉత్తరం నీకు చేరినవెంటనే యింటివద్దనుంచి నీవు బయలుదేరినపక్షములో, అర్ధరాత్రికాకపూర్వమే, అంతకంటె చాలా ముందుగా నీవు నీ స్వగృహానికి చేరుకోవాలి. నీకు ఆమాత్రపు వ్యవధిని కొసరుగా యివ్వడానికి కారణమేమంటే, దురూహ్యమైన అనివార్యమైన ఆటంకాలు ఏవైనా రావచ్చు—అంతే కాదు. తర్వాత జరుగవలసిన కార్యక్రమమునకంతటికీ, నీ యింటినవుకర్లు నిద్రపోతూఉండే వేళ చాలా ఉత్తమమైనది. కనుక, నీవు రోగులను చూచేటటువంటి గదిలో సరిగ్గా అర్ధరాత్రి సమయానికి హాజరుగా ఉండాలి. నాపేరుతో నీవద్దకు వచ్చేడి మనిషినొకనిని నీ చేతితో నీవే స్వయంగా ఆహ్వానించి లోపలికి తీసికొనిపోవాలి—. నా కచ్చేరీ గదినుంచి నీవు తెచ్చిన సొరుగును అతనిచేతికి యివ్వాలి. అలా చేసినట్లయితే, నీపని నీవు ముగించినవాడవై నాకు నీవు పరిపూర్ణ కృతజ్ఞతాపాత్రుడవవుతావు. అటుపైన అయిదు నిమిషాలు గడిచినపిమ్మట, ఈ ఏర్పాటులన్నీ ఎంత ప్రాణావసరమైనవో నీకే బోధ









పడగలవు. ఇదంతా నీకొక వెర్రివ్యవహారంగా కన్పించినప్పటికీ, పై చెప్పిన పనులలో ఏదైనా ఒక్కటి నిర్లక్ష్యంచేస్తే, నా బాధకు నీవు కారణభూతుడవవుతావు — లేదా, నా వివేక విధ్వంస కారణుడవవుతావు:

నా మనవిని నీవు తృణీకరించవనే నమ్మకం నాకు ఉంది—కాని, అటువంటిది జరుగునేమో అనే భావం తలపుకువచ్చినంతమాత్రంచేతనే నాగుండె జేజార్రై, నా చేయి గజగజలాడుతోంది — ఊహాకందని ఒకానొక అధోగతిఅవస్థలో ఒక విపరీతప్రవేశంలో యీ సమయమందు నేను ఉన్నానని గ్రహించు. ఈ నాదుస్థితిని ఎంతగా పెంచి ఊహించినా అది అతిశయోక్తి కానేరదు. వేళ తప్పకుండా సకాలంలో నీవు నాకు తోడ్పడినట్లయితే, కథ కంచికి వెళ్లినదన్నట్లుగా, నా కష్టాలన్నీ మాయమైపోతాయి ప్రియతముడవైన లాన్యన్! నాకీ సహాయంచేసిపెట్టు—. రక్షించు.

నీమిత్రుణ్ణి
హెచ్. జే—.

తాజాకలం:—ఈ ఉత్తరం వ్రాసి నేను దీన్ని సీలుచేసినతర్వాత్త మరొక కొత్త అనుమానభీతి నాకు కలిగింది—ఒక వేళ తపాలా ఆఫీసు వాళ్లే నాకు విఘ్నం కలుగ జేయవచ్చు! రేపు ఉదయంవరకూ యీ ఉత్తరం నీ చేతికి అందకపోవచ్చు. అట్టిసందర్భములో, పగలు నీకెప్పుడు వీలవుతుందో అప్పుడే నే కోరినపని నాకు చేసిపెట్టు. అర్థరాత్రివేళ నామనిషికోసం ఎదురు చూడాలి—. అప్పటికే చాలా కాలాతీతంకావచ్చు—. ఆరాత్రి నేను చెప్పినప్రకారంగా ఎవరూ నీవద్దకు రానియెడల, హెన్రీ జెకిల్ చూపు లిక లేవని గ్రహించు"

ఈ ఉత్తరం చదివినపిమ్మట నా సహచరునకు పిచ్చి ఎత్తినదని నేను నిశ్చయించుకున్నాను. ఆవిషయం నిస్సంశయంగా నిర్ధారణ అయ్యేవరకు అతడు కోరిన పని నెరవేర్చడం తప్పదనుకున్నాను. ఈ అడివిగొడవ ఉత్తరం నాకు బోధపడడం ఎంత దుర్ఘటమో, ఆ ఉత్తరప్రాధాన్యమును గ్రహించడం కూడా అంత దుర్ఘటంగానే ఉంది—. అదిన్నీగాక, ఆవిధమైన వాక్యధోరణిలో నాకు మొఱపెట్టుకుంటూ అతడు ఉత్తరం వ్రాసికొన్నప్పుడు, దానిని నిరాకరించి త్రోసివేయడం చాలా జవాబుదారీతోకూడిన పని. అందువల్ల నేను వెంటనే నామేజాబల్లవద్దనుంచి లేచి, బండీ ఎక్కి సరాసరిగా జెకిల్ యింటికి వెళ్లాను. నాకోసం బట్లరు ఎదురు చూస్తున్నాడు. నాకు చేరినట్లుగానే అదేపోస్టులో బట్లరుకుకూడా ఒక రిజిస్టర్డు కవరు ఉత్తరం చేరింది—. అతడు చేయవలసిన పనులు ఆ ఉత్తరంలో వ్రాసి ఉన్నాయి. తాళములు బాగుచేసేవానికోసం, వడ్రంగికోసం వెంటనే కబురు చేశాడు. మేమిద్దరమూ మాట్లాడుకుంటూ ఉండే సమయంలోనే ఆపనివాళ్లిద్దరూ హాజరైనారు. మేమందరమూ కలిసి ఆ భవనపు పూర్వ ఖామందైన డాక్టరు డెన్మాన్ తాలూకు శస్త్రచికిత్సశాలలోకి వెళ్లాము. ఆ శాలలోనుంచి (నీకు బాగా తెలిసే ఉంటుంది) జెకిల్ యొక్క సొంతకచ్చేరీగదిలోకి సులభంగా పోవచ్చు —. తలుపు చాలా గట్టిది. దాని తాళంకూడా దిట్టంగా ఉంది—, తాళాన్ని బలవంతంగా తెరచేపక్షములో అది కొంతవరకు చెడిపోగలదనిన్నీ, తనకు అందులో చాలాశ్రమ ఉన్నదనిన్నీ ముందుగానే ఖండితంగా వడ్రంగి చెప్పాడు. తాళాలపనివాడు చాలా తంటాలు పడీ విసుగెత్తి ఉన్నాడు. కాని, యీ తాళాలపనివాడే చేతిలో మంచి పనితనంకలవాడు. రెండుగంటలసేపు అవస్థపడ్డాడు. ఎట్లాగైతేనేం? చిట్టచివరకు తలుపు తెరచుకుంది. "ఇ" గుర్తుగల బీరువా తాళంవేసి లేదు. అందులోనుంచి కావలసిన సొరుగును బయటకులాగి, దానిని చెత్తగడ్డితో నింపి, ఒకటి కాగితం దానికి చుట్టి, దానిని నా వెంటతీసికొని కావెండిష్ చౌకునకు తిరిగివచ్చాను.

ఇక్కడకు చేరినతర్వాత, దానిలోఉన్న వస్తుసామగ్రిని పరిశీలించడం ప్రారంభించాను. దానిలో ఉన్న చూర్ణములు చాలా శుభ్రంగానే తయారైయున్నాయి. కాని, మందులషాపులో తయారు చేసినంత నాజూకుగా లేవు. కాబట్టి ఆ చూర్ణములను జెకిల్ స్వయంగా తయారుచేశాడని అర్థమవుతోంది. అందులో ఒక చూర్ణపుపొట్లము తాలూకు పైకాగితం తీసి చూశాను. అది తెల్లని స్ఫటికపు ముక్కలవంటి క్షారం —. అనంతరం అందులో సొరుగులో ఉన్న సీసాను తనిఖీ చేశాను ఎర్రని



# మనిషిలో మనిషి



రక్తవర్ణ ద్రావకం ఒకటి సీసాలో సగానికి ఉంది. వాసన చాలా ఘాటుగా ముక్కు మంటపెట్టేటట్లుగా ఉంది. బహుశః దానిలో భాస్వరమున్నూ సారా యున్నూ కలిసివుంటాయి—. ఇంకా అందులో కలిసిన యితరదినుసులు ఏమిటో నేను ఊహించలేకపోయి నాను. సొరుగులో వున్న పుస్తకం, నోటుబుక్కు వంటిది. దానిలో వరుసగా కొన్ని తేదీల సంఖ్యలు నమోదు చేయబడి ఉన్నాయి. అంతకుతప్ప అందులో ఏమీ వ్రాసిలేదు. ఈ తేదీలనుచూస్తే, చాలాసంవత్స రాల కాలపరిమితికి విస్తరించిన తేదీలుగా ఉన్నాయి కాని, యీ తేదీల నమోదులు సుమారు ఒక సంవత్సరంనుంచీ పుస్తకంలో వ్రాయబడలేదు— కొన్ని వందల నమోదులు పరిశీలించిచూస్తే బహుశః ఒక్క అరడజనుసార్లు "డబిల్" (రెండింతలు) అనే మాట కన్పిస్తుంది. ఇటువంటి ముక్తసరిమాట తప్ప ఆ తేదీల ప్రక్కను వ్రాయబడిన విషయమేమీ లేదు. ఆ తేదీల నమోదుల ప్రారంభ భాగంలో ఒకచోట "పూర్తిగా భగ్నమైంది!" అనేమాట ఆశ్చర్య సూచక గుర్తులతో వ్రాయబడి ఉంది. ఇదంతా పరిశీలించి, చూచిన నాకు దాని అర్థం ఏమిటో తెలిసికోవాలనే కుతూహలం చాలా కలిగింది. కాని, దానిభావ మేమిటో నాకు అంతు చిక్కలేదు. ఈ సొరుగులో ఉన్న వేమిటంటే, ఒక అరఖూ, కాగితంలో కట్టిన ఔరామూ, ఏవో కొన్ని పరిశోధనా ఫలిత సారాంశ ములనివేదిక-ఈ పరిశోధనలవల్ల ప్రత్యక్ష ప్రయోజనం ఏమీ ఉన్నట్లుగాలేదు. జెకిల్ చేసిన శాస్త్రపరిశోధనా ప్రయోగాలు అనేకం అటువంటివే. ఈ వస్తుసామ గ్రులు నాయింట్లోకి వచ్చిఉండడంవల్ల గుండె చెదరి యున్న నామిత్రుని మానం, ప్రాణం, జ్ఞానం ఏవిధంగా రక్షింపబడిన వవుతాయి? అతని నవుకరును ఒక తావుకు తన పనిమీద పంపించుటకు వీలుఉన్నప్పుడు, ఇంకొక తావుకుమాత్రం ఎందుచేత పంపించుటకు సాధ్యంకాదు? అందుకు ఏవో కొన్ని అభ్యంతరాలు ఉంటే ఉండుగాక! ఈ పెద్దమనిషి ఎవ్వరికంట బడ



కోనేటిగట్టు

చిత్రకారుడు:—ఎం. కృష్ణారావు, (15-సం) ఆముదావలస.

కుండ నాయింటికి రావలసిన అగత్యమేమిటి? ఈవిష యాలన్నీ నేను ఆలోచించిన కొలదీ, మతిచెడిన వ్యాధిగ్రస్తుని లక్షణాలే యివి అని నాకు బాగా బోధపడింది. నా నవుకర్లను "వెళ్ళి పడుకోండి" అని పంపించివేశాను. కాని, ఆత్మరక్షణకు నేను సిద్ధపడ

(40-వ పేజీ చూడుడు)

# పాత గొడుగు

బయట వర్షం జోరుగా పడుతోంది. పేరిశాస్త్రి మూలనున్న పాతగొడుగు బయటికి తీసి, బూజు దులిపి, పురాణశ్రవణానికి రామమందిరం వేపుబయలు దేరాడు.

మందిరంనడవలో ఓమూల తన గొడుగును భద్రం చేసుకుని, అటు తిరిగాడు. తనలాగే పురాణశ్రవణానికి వొచ్చిన పెద్దమనుషులు తెచ్చుకున్న రకరకాల గొడుగులు, తలోవేపు - గోడలకి వ్రేలాడేసీ - తలుపు చాటునా, గోడమూలనా దాచుకున్నవీఅవుపించినై. అందులో తలుపుచాటున గోడకానించి వున్న కొత్తగొడుగు ఎలెక్ట్రిక్ లైటు కాంతిలో నిగనిగలాడుతూ శాస్త్రిగారికళ్లల్లో జిగేలుమంది.

"ఎంత బాగుంది! - అలాంటిది నాకూ ఒకటుంటే ఎంత బావుణ్ణు!" అనుకున్నాడు. కాని, అలాంటిది తనజన్మలో కొనుక్కోలేడు. కనీసం పదిహేను రూపాయలైనా పెట్టందే తనకిఅలాంటిగొడుగురాదు. అంచేత "నాలాటి దరిద్రుడికి అలాంటిఆశలు పనికిరావు" అనుకుని, ముందుకి నడిచాడు.

రెండడుగులు వేశాడో లేదో అతగాడి బుర్రలో మెరుపులాంటి ఆలోచన మెరిసింది. అడుగులు వెనక్కి పడ్డయ్. మళ్ళీ అంతలోనే ఆ ఆలోచన అంత సబబైందిగా తోచలేదు అతనికి "ఛీ! ఛీ! ఏంపని? ... ఎవరికేనా తెలిస్తే పరువుపోదూ? ఇంత బతుకూ బతికి యీనాటికి దొంగపేరెత్తుకోవాలా? ..." అనుకున్నాడు. కాని, మనసు మాత్రం కొత్తగొడుగుమీదేవుంది.

చివరికి ఓ చక్కటి వుపాయం ఆలోచించాడు. చుట్టుపక్కల ఎవరూ లేకపోవడం గమనించి, మెల్లగా ఆ కొత్తగొడుగు స్థానంలో తన పాతగొడుగునీ - తన పాత గొడుగుస్థానంలో ఆ కొత్త గొడుగునీమార్చి, తిన్నగా మందిరంలోకి దారితీశాడు.

వి. యస్. చెన్నూరి

పేరిశాస్త్రి అందరితోబాటు కూచుని పురాణం వింటున్నాడే కాని, ఒక్క ముక్కకూడా అర్థం కావడం లేదు. ధ్యాసంతా కొత్త గొడుగుమీదే వుంది.

"పాపం గొడుగు సొంతగాడెవడోగాని, అవసరంలో తన గొడుగు అవునో కాదో అనైనా చూచుకోకుండా, పాతగొడుగు పట్టుకెళతాడు. ఆ కొత్తగొడుగు నాకు మిగిలిపోతుంది. ఎంచక్కావుందాగొడుగు! ... ఇంతకీ యీరోజు నిద్రలేచి ఎవరిమొహం చూచానోగాని బలేఛాన్సు కొట్టేస్తున్నాను ..." అని తనలో తాను వుబ్బి తబ్బిబ్బులౌతున్నాడు.

పురాణపఠనం ఆఖరిఅధ్యాయంలోకి అడుగెట్టింది. ఆవులింతలద్వారా నిద్రాదేవతని ఆహ్వానించేవారూ - కునికిపాట్లద్వారా పెద్దమ్మని పూజించేవారూ వొక్కొక్కరుగా ఇళ్లకు జారుకొంటున్నారు. మన పేరిశాస్త్రిగారిక్కూడా నిద్ర ముంచుకొస్తోంది కాని, అక్కణ్ణించిమాత్రం కదల్లేదు.

"ముందుగా లేచి, ఆ కొత్తగొడుగుని పట్టుకుపోతుండగా సొంతగాడికంటబడితే పెద్ద చిక్కొచ్చిపడుతుంది. నన్ను దొంగక్రింద జమకట్టవచ్చు. ముందు అతడే నా పాత గొడుగునిపట్టుకెళ్లాలి. అప్పుడయితే నిర్భయంగా నేనాగొడుగుని పట్టుకెళ్లవచ్చు. అప్పుడు ఒకవేళ

సొంతగాడి కంటబడ్డా ఫరవాలేదు. పొరబాటున జరిగిందని అతడే వొప్పుకుంటాడు. అంచేత అందరూ వెళ్లిన తరువాతగాని, నేనిక్కణ్ణించి కదలకూడదు" అని నిశ్చయించుకున్నాడు.

పురాణం ఆఖరైంది. అందరూ వెళ్లాక పేరిశాస్త్రి మెల్లగా లేచి బయలుదేరాడు.

తీరా శాస్త్రిగారు పడవలోకి చేరుకుని, గొడుగుకోసంచూసేసరికి గుండె గబుక్కున ఆగిపోయింది. కొత్తగొడుగు కాదుకదా, కనీసం పాతగొడుగైనా కనిపించలేదు.

"ఎవడో దొంగవెధవ నానోట మట్టికొట్టి రెండు గొడుగులూ కాజేశాడు. ఎంతపని జరిగింది!" అనుకుంటూ స్థాణువులా నుంచుండిపోయాడు.

పాపం, అత్యాశకుపోయి వున్నది కూడా పోగొట్టుకున్నందుకు తన్ను తాను నిందించుకుంటూ, యేడుపు ముఖంతో ఇల్లు చేరుకున్నాడు.

శాస్త్రిగారికి ఆరాత్రి యెంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు.

మరునాటిపుదయం ప్లీడరు రమణయ్యపంతులుగారింటికి సంభావనకి వెళ్లాలిసి వొచ్చింది. తన పాత గొడుగు ప్లీడరుగార్లింట్లో టేబులు మీదకనిపించేసరికి శాస్త్రిగారి ఆశ్చర్యానికి మేరలేకపోయింది. కాని, ఆగొడుగు తనదని చెప్పకునేందుకు తటపటాయించాడు. ఈ ప్రస్తావన ప్లీడరుగారితో ఎలా తేవడమా అని ఆలోచిస్తానే వున్నాడు.

భోజనానంతరం పంతులుగారు శాస్త్రిగారితో ఆమాటా యీమాటా ముచ్చటిస్తూ, రాత్రి యెవడో దొంగవెధవ తన కొత్త గొడుగుని తస్కరించి, దాని స్థానంలో యీ పాతగొడుగుని వదలిపెట్టివెళ్ళిన వుదంతాన్ని ప్రస్తావనకి తెచ్చేసరికి శాస్త్రిగారి మనస్సులో గతుక్కుమంది.

ఆ పాతగొడుగు తనదేనని చెప్పుకుని, దొంగతనం నెత్తినేసుకోవడం యేమంత తెలివయిన పనిగా తోచలేదు శాస్త్రిగారికి. అంచేత 'గప్‌చిప్'గా వుండిపోయాడు.

పైకిమాత్రం గొడుగుని చేతిలోకి తీసుకుని - అటూ ఇటూ తిప్పి పరిశీలించి - "అబ్బే, గొడుగు చాల పాతది. ఇంతకూ వాడెవడో దొంగవెధవ బలేటోక్రా వేశాడు మీకు" అని తన అభిప్రాయాన్ని వెల్లడించినట్టు వెల్లడించాడు. కాని, మన

(43-వ పేజీ చూడండి)



ఎవరూ లేకపోవడం గమనించి, మెల్లగా ఆకొత్తగొడుగు స్థానంలో తన పాతగొడుగునీ-తన పాత గొడుగు స్థానంలో కొత్తగొడుగునీ మార్చి తిన్నగా మందిరంలోకి దారితీశాడు.

# అమెరికన్ పిస్తోలు

గోపి శ్రీ

రామూ రౌడీ అన్న సంగతి ఆబడికీ, ఆగ్రామానికీకూడా తెలుసు. అమ్మ నాన్న తొందర మూలంగా అష్టమతరగతి అతి కష్టంపై మూడో యేడు ముచ్చటగా దాటేశేడు.

అంతటితో ఆచదువుకు ఫుల్ స్టాఫ్ పెట్టి రాజకీయాల్లో ప్రవేశించాలని తీర్మానించుకొన్నాడు. రాజకీయాలు నేర్చుకోవాలంటే వార్తా పత్రికలన్నీ ప్రోగుచేసి చదవటం మొదలెట్టాడు.

ఆలా చదువుతూ పోతూంటే ఓ వార్తా పత్రికలోని "అమెరికన్ మాడల్ పిస్తోలు కొనండి. ధర సరసము. లైసెన్సు అవసరము లేదు" అన్న ప్రకటనఒకటి రామూని ఆకర్షించింది. రాము యోచించాడు. 'మనం యెటూ రాజకీయవాదికాబోతున్నాము గాబట్టి ఓపిస్తోలు అవసరమే' నసుకొన్నాడు. వెంటనే ముక్కానీ కార్డుకొని ఒక పిస్తోలుకు ఆర్డరు వ్రాసి పంపేశాడు. స్నేహితులతోకూడా తాను పిస్తోలు కొనబోతున్నానని సగర్వంగా ప్రకటించుకొన్నాడు.

వారం గడచింది. వి. పి. పి. వచ్చింది. మూడుమ్ముప్పావలా చెల్లించమన్నాడు తపాలా బంట్రోతు. ఎంతో శ్రమపడి డబ్బులార్జించి మూడుమ్ముప్పావలా చెల్లించి వి. పి. పి. తీసుకొన్నాడు. ఆత్రం కొద్దీ వెంటనే పెట్టె పగులగొట్టాడు. పిస్తోలు నిగనిగా మెరుస్తోంది. రామూ కళ్లు జిగేలుమన్నాయి. వెంటనే స్నేహితుల నలుగుర్నీ పిలిచాడు. కేపులు బిగించి ఓపిట్టను గురిచూసి కొట్టాడు.. పిట్ట యెగిరిపోయింది. శబ్దంమాత్రమే గొప్పగా వచ్చిందికానీ గుండ్లు లేవు. రాము తెల్లమొగం వేశాడు. స్నేహితులంతా గొల్లుననవ్వారు. రామూకు పట్టరాని కోపం వచ్చింది. ఒక్క పరుగుతో పోస్టు బంట్రోతువద్దకు పోయి "యీ తుపాకి నాకొద్ద" న్నాడు. జవాను ఓ నవ్వు నవ్వి "నాకు మాత్రం యెందుకూ? ఆ కంపెనీవాడికే పంపించు" అన్నాడు.

రామూకి కోపం రెట్టింపయింది. దీని నెలాగైనా అమ్మేయాలనుకొన్నాడు. ఎందరితోనో బేరం సాగించాడు. అందరూ వద్దన్నారు. తుదకు బస్తీకి బయలుదేరాడు. రోడ్డునబడి పోతూన్నాడు. అలా పోతూండగా రామూకు ఎదురుగా ఓ ముదుసలి బస్తీలో నరుకులుకొని మూట నెత్తిమీద బెట్టుకొని వస్తూన్నాడు. ఆ తాతను చూడగానే రామూమనస్సులో ఓ ఆలోచన మెరుపులా మెరిసింది. అటూ యిటూ చూచాడు. రోడ్డుమీద మరెవరూ లేరు. రాము గబగబా తాతకి ఎదురుగా వెళ్ళి "ఆగు"అని బిగ్గరగా అరచి పిస్తోలు అతని రొమ్ముకి సూటిగా గురిపెట్టాడు. తాతకూడా జడిసిపోయి విగ్రహంలా నిల్చుండిపోయాడు.

"నీ నెత్తిమీది మూట యిలా యిచ్చిపోతావా? లేక యీ పిస్తోలుతో కాల్చి చంపమంటావా?" అని గట్టిగా అడిగాడు రాము.

దానికేమి చెప్పాలో తాతకు తోచలేదు. ఇవ్వనంటే పిస్తోలుతో పేల్చేస్తాడనే భీతిమాత్రం ఓప్రక్క పీకుతోంది. కానీ యింత చిన్న పిల్లాడికి లొంగిపోతే యెలా గనుకొని ఓ యోచనచేసి "నామూట యిస్తానుగానీ, దాని బదులుగా నీ పిస్తోలు యిస్తావా?" అన్నాడు.

మంచి బేరమే ననుకొని "సరే అలాగే" నన్నాడు రాము. వెంటనే రాము తన పిస్తోలునిచ్చేసి మూట తీసుకొన్నాడు. ముసలి తాత బలే తెలివి ప్రయోగించామనుకొని "నామూట నాకిస్తావా? కాల్చి పారేయమంటావా?" అన్నాడు.

"అది అమెరికన్ మాడల్ పిస్తోలు" అన్నమాట మరచిపోయి, రామూ కంగారు పడ్డాడు. తాత తాలూకు మూట అక్కడ పారేసి కాళ్లకి బుద్ధిచెప్పి పారిపోయాడు.

ఇలా ముగిసింది అమెరికన్ పిస్తోలుకథ. ★

# ★ కొంపకోసం ★

(24-వ పేజీ తరువాయి)

ఖానవుడన్న తర్వాత తప్పనిది. అందులోనూ పెద్దవాణ్ణవుతున్నానా..."

"అవునవును. అందుకే స్వయంగా మిమ్మల్ని కలుసుకోవాలనుకున్నారు. కాని ఏదో అడ్డంకి..."

"ఆ, అంత శ్రమ దేనికిలే గాని, ఈ ఇంట్లోకి ఎవరో వొస్తామన్నారోయ్."

"ఎవరూ?" నీరసంగా అన్నాడు సూర్యనారాయణ. రామారావుకాళ్ళు వొణికినయ్.

"ఎవరో వెంకటేశ్వర్రావుట, బెజవాడ ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటులో పనిట."

"ఎప్పుడొస్తామన్నారండీ!"

"ఎల్లుండి."

"అన్నట్టు వారొక్కరేనా లేకపోతే సంసారమా?"

"పెళ్ళాం, పిల్లలూ వున్నట్టున్నారు. కాని వాళ్ళుగనక ఎల్లుండి రాకపోతే ఈ ఇల్లు మీకు తప్పకుండా ఇచ్చివేస్తాను. అసలు నేనిక్కడ వుండను. ఎల్లుండి ఆయన వొస్తానంటే పోనీ ఈ రెండు రోజులూ ఆగి ఇల్లు ఆయన కప్పజెప్పి మా వూరు వెళ్ళిపోదామని వున్నాను."

"అలాగా."

"మళ్ళీ చెబుతున్నాను. ఏ కారణం వల్లైనా ఆ వెంకటేశ్వర్రావుగారు రావటం పడకపోతే, ఈ ఇల్లు తప్పకుండా మీకే ఇస్తాను సరేనా?"

"మంచిదండి." సూర్యనారాయణ నవ్వుతూ అన్నాడు. రామారావుకి మండింది.

కొంప ఖాళీగా లేదన్న వార్తవిని కూడా సూర్యనారాయణ అంత ఉత్సాహంగా వుండటం చూసి రామారావు ముఖం చిట్లించుకున్నాడు. ఇంటాయనదగ్గర సెలవు తీసుకుని ఇద్దరూ బయటపడ్డారు. దోవలో సూర్యనారాయణ అడిగాడు.

"ఇల్లు నచ్చిందా?"

"ఇల్లెలా వుంటే మనకేమిటిలే" చిరాగ్గా అన్నాడు రామారావు.

"ఏం?"

"తెలియనట్టడుగుతావేం. ఆ వెంకటేశ్వర్రావుకిచ్చేశానని నీతోనే గా చెప్పింది. ఇంక దాన్నిగురించి ఆలోచించటం శుద్ధ అనవసరం."

"ముందసలు నీకు ఇల్లు నచ్చిందా, లేదా చెప్పు?"

"ఇంటికేం బాగానే వుంది."

"ఏమోయ్ రామారావ్, నిన్న చూసిన ఇంటివైపోసారి వెళ్ళొద్దామా, ఆయన రాలేదేమో!" మర్నాడు సూర్యనారాయణ రామారావుతో అన్నాడు.

"అంతా నీ వెర్రి గాని ఎవరైనా ఇల్లు మాట్లాడుకెళ్ళిం తర్వాత రాకపోటమంటూ వుంటుందా?"

"అయినా ఓసారి చూసొద్దాం రారాదూ?"

"నిన్న తిరిగిన తిరుగుడుకి ఇవాళ్టివరకూ నా కాళ్ళు స్వాధీనంలోకి రాలేదోయ్. మళ్ళీ ఇవ్వాళ అంతదూరం వెళ్ళి కాళ్ళీడ్చుకుంటూ రావట మెందుకు?", రామారావు నిస్పృహతో అన్నాడు. "అయినా ఆయన ఇంట్లో ప్రవేశిస్తానన్నది రేపు గాని ఇవ్వాళ కాదుగా."

సూర్యనారాయణకి కోపం వొచ్చింది. విసుగ్గా అన్నాడు.

"అయితే ఇదంతా నాకోసమంటావా?"

రామారావు మారు మాట్లాడకుండా లేచి అతన్ని అనుసరించాడు.

వారిని చూడగానే ఇంటాయనముఖం విప్పారింది. మహదానందంతో అన్నాడు—

"వొచ్చారా నాయనా, మీకోసమే ఎదురుచూస్తున్నాను. కాని మళ్ళీ రేపు గాని రారేమో అని భయపడ్డాను. అయితే ఇవ్వాళ సాయంత్రానికల్లా వొచ్చి ఇంట్లో ప్రవేశిస్తారుకదూ. ఈరాత్రే నేనూ మా వూరి కెళ్ళిపోతాను."

రామారావు కీ పరిస్థితి ఆశ్చర్యంగానూ, అర్థంగాకుండానూ వుంది.

"అయితే వెంకటేశ్వర్రావుగారు రారాండి." అని ప్రశ్నించాడు అమాయకంగా.

"ఇంకెక్క వాడిపేరెత్తకు వెధవ." గతం స్ఫురణకి రాగా ఆయన ముఖం కందగడ్డలా అయింది. పళ్ళు కొరికాడు. రామారావుకిదంతా అయోమయంగా వుంది.

ఆ సాయంత్రమే రామారావూ, సూర్యనారాయణ సామానంతా ఇంట్లో సర్దేశారు. విశ్రాంతికోసం షికారు వెళ్ళటానికి సిద్ధపడుతూంటే ఇంటాయన వారి కెదురుగా వొచ్చి "ఒక్క చిన్న పని చేసి పెట్టాలోయ్" అన్నాడు.

"ఏమిటండీ, అది?" సూర్యనారాయణ ఆప్యాయంగా అడిగాడు.

"ఈఉత్తరం కాస్త పోస్టులో వేసి పెడుదూ, నీకు పుణ్యముంటుంది."

"ఓ దానికేమండీ తప్పకుండా వేస్తాను" అంటూ సూర్యనారాయణ కార్డు తీసుకున్నాడు. ముసలాయన అతనివైపు ఆదరపూర్వకంగా చూసి సెలవు తీసుకున్నాడు.

సూర్యనారాయణ ఆ వుత్తరంలోని విషయాల్ని ఓసారి లోపలికి చదువుకుని మళ్ళీ నవ్వుతూ బిగ్గరగా చదివాడు—

వెంకటేశ్వర్రావుకి,

నువ్వు మా యింటినిగురించి సవివరంగా రాసిన వుత్తరం చేరింది. అది పాడుపడ్డ కొంపనీ, దయ్యాల నిలయమనీ నువ్వు విన్న విషయాలన్నీ కేవలం కల్పనలుగా గమనించమనవి. నీవంటి అనుమానికీ, అసత్యవార్తా ప్రచారకుడికీ నా యిల్లు అప్పగించబోవటంలేదని తెలియజేయటానికి ఆనందిస్తున్నాను. ఆ ఇంట్లో ఇవ్వాళే ఓ కుర్రాడు ప్రవేశించాడని తెలుసుకోవలసింది."

"ఏమిటో అంతా వింతగా వుంది."

"ఇప్పుడు మరింత వింత చూద్దువుగాని ముందా వుత్తరం చింపేశేయి." సూర్యనారాయణ నవ్వుతూ జేబులోనించి ఓ కార్డు తీసి ఈ విధంగా రాశాడు—

"ప్రియమైన వెంకటేశ్వరరావుగారికి,

అనివార్య కారణాలవల్ల మీకు వాగ్దానం చేసిన ఇంటిని మీ కప్పగించలేనని తెలియజేయటానికి చింతిస్తున్నాను. కారణం, మా బంధువుల కుర్రవాడి కివ్వవలసి రావటమే. మరేమీ అనుకోవొద్దు. ఈ వూళ్ళో కొత్తపేటలో ఫామిలీ పోర్షనొకటి వేకెంట్‌గా వుందని తెలుస్తోంది. దయచేసి ఆ విషయం వాకబు చేయగలరు. నేనీవాళే మా వూరు వెళ్ళిపోతున్నాను.—

సుబ్బయ్యపంతులు."

"ఏమిటిదంతా?"

రామారావు తెల్లబోతూ అడిగాడు.

"కొంపకోసం, కోటి విద్యలు."

సమాధానంగా అన్నాడు సూర్యనారాయణ, నవ్వుతూ. ★

# ★ మనిషిలో మనిషి ★

(35-వ పేజీ తరువాయి)

వలసినపరిస్థితి తటస్థించునేమో అనే భయంతో, ఎందుకైనా మంచిదని, పాత రివాల్వరును ఒకటి తీసి దానిలో తోటా ఎక్కించాను.

లండను నగరంలో రాత్రి పండ్రెండుగంటలు కొట్టెనో లేదో, నా వాకిలి తలుపును మెల్లిగా కొట్టినట్లు శబ్దమైంది—. నేనే స్వయంగా తలుపువద్దకు వెళ్లాను. పొట్టిమనిషి ఒకడు వాకిట్లో ముఖమంటపంలో స్తంభంవద్ద నక్కియున్నాడు.

“మీరు డాక్టరు జెకిల్ వద్దనుంచి వచ్చినారా?” అని నేను ప్రశ్నించాను.

“అవును” అని అతడు మాట బిగబట్టుకొనినట్లుగా సైగ చేశాడు. లోపలికి రమ్మని నేను పిలిచినప్పుడు, బయట చీకటిలో ఆచౌకు నైపుకొకసారి వెనక్కి తిరిగి ఓరచూపులతో చూచి అటుపిమ్మట లోపలికి వచ్చాడు. సమీపంలోనే రోడ్డుమీద పోలీసువాడొకడున్నాడు. దీపం చేతబట్టుకొని గస్తీ తిరుగుతున్నాడు. నాయింటికి వచ్చినమనిషి వానిని చూచి, తత్తరపాటుతో, మరింత తొందరగా లోపలికివచ్చాడు.

ఈ సందర్భములన్నీ నాకు చాలా అసహ్యకరంగా కన్పించాయి. రోగులు వైద్యసలహాలకై నాతో సంప్రతించే గదిలో వెల్తురు బాగా ఉంది. నా ఆయుధం నాచేతిలో గట్టిగా పట్టుకొని అతనిని నా వైద్యసంప్రతింపుల గదిలోకి తీసికొని వెళ్లాను. ఇక్కడ అతనిరూపం స్పష్టంగా చూడగల అవకాశం నాకు కల్గింది. అతనినిఅంతకుముందు నేనెప్పుడూ చూడలేదనే మాట నిశ్చయం —. నేనింతకుపూర్వం చెప్పినట్లు అతడు చాలా పొట్టిగా ఉన్నాడు. అది యట్లుండగా అతనిముఖం చాలా ఘోరంగా ఉంది. కండల కదలికనుబట్టి అతనిలో చాలా చాకచక్యం కనిపిస్తోంది. కాని అతని శరీరతత్వాన్ని తారుమారుచేసే రుగ్మత ఏదో ప్రవేశించినవానివలె ఉన్నాడు. ఇరుగుపొరుగు పరిస్థితులవల్ల మనిషి మతిచెడి గతిచెడినవానివలె ఉన్నాడు. కఠిన నియమనిగ్రహముల ఫలిత ప్రారంభదశలక్షణంగా ఉంది. నాడికూడా నీరసించినట్లుంది. ఆ మనిషికి రోత పుట్టించిన ఏవో కొన్ని సందర్భకారణాలవల్ల తల తిక్కతత్వం ఒకటి అతనిలో వికృతంగా ఏర్పడిందని అప్పటికప్పుడు నేను మనిషిని చూడగానే ఊహించాను—కాని, యీ వికృత లక్షణాలు యింతతీవ్రంగా ఉండడం నాకు వింతగా కన్పించింది. ఈ వైకల్యం అతనిలో వస్తుతః ఉన్నదేమో అని నాకు అనుమానంగానే ఉంది. అప్పటినుంచీ—కేవలం రోతవల్లగాని, విద్వేషంవల్లగాని యింత మార్పు కలుగజాలదనియు, అంతకంటె గంభీరమైన మరికొన్ని హేతువులు ఉండగలవనియు భావించాను.

ఇంట్లోకి ప్రవేశించినదాదిగా అమిత అసహ్యకరమైన వింత శాల్తీగా కన్పించినటువంటి ఆమనిషియొక్క దుస్తులు ఇంకోమనిషి తొడుక్కొన్నట్లయితే, ఎంతో నవ్వులాటలుగా ఉండేది. అతడు తొడుక్కున్న దుస్తులు చాలా ఖరీదు గలవి. గుడ్డ దర్జాగా ఉంది. కాని, ఆ దుస్తులు అతని కొలతలకు మితిమీరి ఉన్నాయి. లాగూ పాదాలుదాటి చాలా పొడుగుగా జీరాడుతూ ఉంది. వ్రేలాడుతున్న లాగూ కొనలు పైకి మడతపెట్టబడినవై నేలమీద యీడ్చుకొనిపోకుండా ఉన్నాయి. ఇక కోటుయొక్క మధ్యభాగం అతని పిరుదులనుదాటి యింకా క్రిందుగా ఉంది. మెడపట్టీ అతని బుజాలక్రిందకుకూడా వచ్చింది. అన్నింటికంటే విచిత్రం ఏమిటంటే, యిటువంటి అకటావికటవేషం చూచినప్పుడు, నాకు నవ్వు అనేది ఎంతమాత్రమూ రాలేదు. నాయెదుటనిల్చున్న వ్యక్తియొక్క ప్రకృతిలోనే ఒకవిధమైన అసాధారణ వికృతత్వం జన్మతః ఏర్పడినట్లుంది. ఆ వికృతత్వం మనస్సును కలవరపెట్టి, రోతపుట్టించే విచిత్ర విపరీత వికృతత్వం—అందువల్ల యీ దుస్తుల అవకతవక లక్షణంకూడా ఆ వికృతత్వంలోచేరిన భాగంగానే కన్పించింది. నేను అతనిప్రకృతి ప్రవృత్తివిషయమై యోచించడమేగాక, అతని పుట్టుపూర్వోత్తరములు, అతని జీవితకథావిశేషములు, అతనిస్థితి, అతని ఆస్తివసతులు తెలిసికోవలెననే యోచనకూడా నాకు కలిగింది.

ఇన్ని నేనింత దీర్ఘంగా వ్రాసినప్పటికీ, కొలది క్షణములలోనే నామనస్సుకు తట్టిన ఊహాలివి.

## సవరణ

**18-11-53** ఆంధ్ర వారపత్రికలో—54 పుటలో — "మనిషిలో మనిషి"—"మిత్రమా! హెన్రీ జెకిల్ మహాశయా! సైతాను శిఖాముద్ర ఎవరి ముఖంమీదనైనా తాండవ మాడుతూ ఉన్నట్లయితే, అది నా మిత్రుడవైన నీ ముఖం మీదనే అని నాకు స్పష్టంగా కన్పిస్తోంది." అని ఉన్నది.

"మిత్రమా! హెన్రీ జెకిల్ మహాశయా! సైతాను శిఖాముద్ర ఎవరి ముఖంమీదనైనా తాండవమాడుతూ ఉన్నట్లయితే, అది నీ క్రొత్తమిత్రుని ముఖంమీదనే అని నాకు స్పష్టంగా కన్పిస్తోంది" అని ఉండవలెను.

నాయింటికివచ్చిన ఆమనిషి తత్తరపాటుతో తహాతహ లాడి ఉడికిపోతున్నాడు.

"అది మీరు తెచ్చారా? అది మీవద్దఉన్నదా?" అని అతడు అరిచాడు. ఆ తొందరతో అతడు అతి చలాకీగా ఉన్నాడు. నా చెయ్యి పట్టుకొని ఒక ఊపు ఊపుటకు ప్రయత్నించాడు.

కాని, అతడు నా చెయ్యి పట్టుకొనగానే నా రక్తం అంతా మంచుగడ్డ తాకినట్లుగా జిల్లుమనడంచేత అతనిని నేను వెనుకకు త్రోసి ఉంచాను. "అయ్యా! మీ రెవ్వరో తెలిసికొని సంతోషించే అవకాశము కూడా నాకింకా కలుగలేదు. దయచేసి అట్లా కూర్చోండి మీరు" అన్నాను. అందుకై అతనికి దారి చూపినట్లుగా నేనుకూడా నా మామూలు కుర్చీలో కూర్చున్నాను. రోగి ప్రక్కను నేను కూర్చుండి మాట్లాడే వైఖరి యీ సమయంలోకూడా నా మనస్సు కలవరపాటునుబట్టియు, నాయింటికివచ్చిన మనిషి నాకు కల్గించిన భీతినిబట్టియు యీ అర్ధరాత్రి వేళ ఎంతవరకుసాధ్యమో అంతవరకు అనుసరించాను.

"డాక్టరు లాన్యన్! క్షమించాలి. మీరుచెప్పేది అంతా మంచి సంప్రదాయంగానే ఉంది. కాని, నా కిప్పుడున్న తొందరమూలంగా మర్యాదలాంఛనాలన్నీ హరించిపోయినాయి. మీ సహచరుడైన డాక్టరు హెన్రీ జెకిల్‌గారు పంపించినందున నేను చాలా ముఖ్యమైన ఒకపనిమీద యిక్కడికి వచ్చాను. నాకు ఆయన తెలియ జెప్పినదేమిటంటే..." ఆమాటలతో కొంచెం ఆగి తనగొంతుకను చేతితో పట్టుకున్నాడు. ఏదో అపస్మారపుతెర వస్తూఉన్నట్లుగానూ, దానిని రానీయకుండా అవస్థపడుతున్నట్లుగానూ కన్పించాడు. "నాకు తెలియజెప్పిన దేమిటంటే, ఒక సొరుగు......" అని ముగించాడు.

అతని ఆదుర్దాచూస్తే నాకు జాలి కలిగింది. ఇకముందు జరుగబోయేదిఏమిటో చూడవలెననే కుతూహలంకూడా నేను పట్టలేకపోయినాను.

నా మేజాబల్ల వెనుకవైపుగా నేలమీద కాగితంతో చుట్టబడియున్న సొరుగును అతనికి చూపించి "అదుగోనయ్యా! అక్కడ" అన్నాను.

అతడు ఒక్క గంతువేసి దానివద్దకు వెళ్లాడు. కొంచెం ఆగి తన గుండెకాయమీద చేయి వేసి కొన్నాడు. అతని పండ్లు పటపట కొరకడం నాకు వినిపించింది. అతని దవడలు కంపించినట్లుగా ఆడినవి. అతనిముఖం పరమభీకరంగా ఉంది. అదిచూస్తే అతని ప్రాణం, అతని వివేకం ఏమైపోగలవో అని నాకే భయం పుట్టింది.

"నిదానించు. సంబాళించుకో" అన్నాను నేను.

అతడు నావంకజూచి చాలా భీకరమైన మందహాసం చేశాడు. అన్నింటికీ తెగించిన మనోనిశ్చయంతో ఆ సొరుగుపైన చుట్టిన కాగితాన్ని పట్టుకొని లాగివేశాడు. అందులో ఉన్నవస్తువులను చూచి, తల్లడిల్లిన ప్రాణం తెప్పరిల్లినదన్నట్లుగా, వెక్కి వెక్కి ఏడ్చాడు. ఇదంతాచూస్తూ నేను స్తంభించిపోయినాను. మరుక్షణంలోనే, అతని కంఠస్వరం స్వాధీనంలోకి వచ్చింది. "మీవద్ద నీళ్లుకొలిచే కొన్నుగ్లాసుఉన్నదా?" అన్నాడు.

నేను కూర్చున్నతావునుండి కొంచెం ప్రయాసతో లేచి అతడు అడిగినదేదో యిచ్చాను.

చిరునవ్వునవ్వుతూ తల పంకించి తన కృతజ్ఞతను నాకు తెలియజేసి, ఎర్రని అరఖులోనుంచి కొన్ని చుక్కలను ఆ గ్లాసులో వేశాడు. చూర్ణం పొట్లములలోని ఒక పొట్లమునుతీసి దానిలోని మందును ఆగ్లాసులో వేశాడు. ఈ మిశ్రమము మొదట ఎర్రగా ఉంది. క్షారంలోని స్ఫటికపు ముక్కలు అందులో కరిగినకొలదీ ద్రావకం రంగు అంతకంతకు తేజోవంతంగా ఉంది. బుసబుసమని పొంగి నీటి నురుగు తుప్పర్లు ఆవిరివలె పైకి వచ్చాయి. బుసబుసమనేడి పొంగు హఠాత్తుగా ఆగిపోయింది. ఆమిశ్రద్రవము ముదురుఊదారంగులోకి మారింది. ఈ రంగుకూడా

## ★ మనిషిలో మనిషి ★

క్రమేణ విరిగిపోయి, లేత ఆకుపచ్చరంగులోకి మారింది. నాయింటికివచ్చిన ఆ మనిషి ఈ మార్పులన్నీ చాలా శ్రద్ధగా పరిశీలిస్తూ చిరునవ్వు నవ్వి గ్లాసును మేజాబల్లమీద పెట్టి నావంకకు తిరిగి నన్ను తనిఖీ చూచినట్లుగా చూచాడు.

అప్పుడతడిలా అన్నాడు. "ఇక ముందు పని ముగించుకోవాలి. మీరు వివేకంగా యోచిస్తారా? సబబైనపద్ధతి అనుసరిస్తారా? ఇక మిగతామాట లేపీ లేకుండా యీగ్లాసును నావెంటతీసికొని నన్ను వెళ్ళిపోనిస్తారా? లేదా, ఇదంతా ఏమిటో తెలిసికోవలెననే కుతూహలం మిమ్ములను వదలిపెట్టకుండా ఉన్నదా? మీరు ఎట్లా నిర్ణయిస్తే అలా జరుగగలదు. కనుక, బాగా ఆలోచించి జవాబుచెప్పండి—మీరు కర్తవ్యం ఏమని నిర్ణయించినప్పటికీ, మీకు కలిగేమార్పు ఏమీ ఉండదు. కాకపోతే, ప్రాణాంతక కష్టదశలో ఉన్న మీ మిత్రునకు మీరు ఉపకారం చేయగల్గితిననెడి ఆనందమే మీరు మూటగట్టుకొనెడి పుణ్య సంపద. అంతకుతప్ప మీకు ఏవిధమైన మార్పూ కలుగదు. అలా కాక, మీరు మరోవిధముగా కోరినట్లయితే, గొప్పపేరు ప్రసిద్ధినిగడించుటకూ శక్తి సంపదను గడించుటకూ తగిన నూతన విజ్ఞాన విశేషములు ఇప్పుడు యీ గదిలో యీ క్షణమందే మీకు ప్రత్యక్ష నిదర్శనములు కాగలవు. ఎటువంటి నాస్తిక పిశాచమునైనా, హడలిపోయేటట్లుగా చేయగల ఒక అసాధారణ ప్రజ్ఞాశాలిమూలంగా మీకీ దిగ్భ్రమ కలుగగలదు.

నాకు నిజంగా మనస్సులోలేని నిబ్బరం నేను తెచ్చిపెట్టుకొని, "అయ్యా! మీరు చెప్పేది అంతా అర్థంకాని యక్షప్రశ్నలు లాగున్నది. మీరు చెప్పేది అంతానిజమనినమ్మి నేను మీమాటలు ఆలకిస్తున్నానని మీరు భ్రమించవద్దు. ఈమాట నేను పల్కినందుకు మీరు విస్మయపడవద్దు—నాకు బోధపడని పరోపకార సేవ నేను యిక్కడికే చాలాచేశాను. కనుక, దీని పర్యవసానం అంతా ఏమిటో ఆఖ్యాసాంతం చూడకుండా ఆగజాలను."

అందుకు అతడు యిలా బదులు చెప్పాడు. "సరే మంచిది. లాన్యన్! నీవు యిదివరలో కొన్ని శపథాలు చేశావు. ఇకముందు జరుగబోయేది అంతా మన వైద్యవృత్తిలో ఉండవలసిన ఆంతరంగిక రహస్య తంత్రంవంటిది. ఇంతవరకూ నీకు చాలా సంకుచితమైన భౌతిక విషయపరిజ్ఞానమే ఉంటూఉన్నది. అటువంటి భావములకే నీవు కట్టుబడి ఉన్నావు. ఆత్మోద్ధారకౌషధ మహిమాప్రభావాన్ని నీవు మిథ్యయని ధిక్కరించినావు. నీకంటె ఘనులైన పెద్దలను ధిక్కరించినట్టి నీవు చూడు యిప్పుడు!"

మందుపోసిన గ్లాసును తన నోటివద్దపెట్టుకొని ఒక్కగుక్కలో ఆమందుఅంతా త్రాగివేశాడు. ఒక్క పెద్దకేక వేశాడు. అతడు తలతిరిగి తూలి వాలిపోయినాడు. మేజాబల్లను గట్టిగా పట్టుకొన్నాడు. నోటితో ఒగర్చుచున్నాడు. లోపలికి యీడ్చుకొనిపోయిన కళ్ళతో నిక్కి చూస్తున్నాడు. నేను చూస్తూచూస్తూ ఉండగానే ఒకమార్పు అతనిలో వచ్చినట్లుగా కన్పించింది. మనిషి పెరిగిపెరిగి విస్తరించినట్లుగా కన్పించింది. అతని ముఖం అకస్మాత్తుగా నల్లబడింది. అతని ముఖలక్షణాలుఅన్నీ కరిగి విరిగి తారుమారైపోతున్నాయి. మరుక్షణం నేను ఒక్కగంతువేసి గోడవైపుకు జేరగిలబడి నిల్చున్నాను. నా మనస్సు అంతా అమితంగా బీభత్సమైపోయింది. నా కంటిఎదుట నున్న ఈ అసాధారణప్రజ్ఞానిధి సన్నిధినుండి తప్పించుకొనుటకై ఆత్మరక్షణకైనా చెయ్యి పైకెత్తాను.

"అయ్యో! దేవుడా! అయ్యో! దేవుడా!" అని అరిచాను. మరల మరల అరిచాను: నా కళ్ళఎదుట పాలిపోయి వణికిపోతూ, సగం స్పృహతప్పినవాడై, తన చేతులతో తడివి చూచుకుంటూ, మరణించిన మనిషి మరల సజీవుడైనట్లుగా లేచి నిల్చున్నాడు, హెన్రీ జెకిల్!

మరుసటి గంటసేపులో అతడు నాకు వివరించి చెప్పినదంతా యీ కాగితంమీద వ్రాయడానికి నాకు స్ఫురణకు రావడంలేదు. నాకళ్లారా చూచిందేదో చూచాను. నా చెవులార విన్నదేదో విన్నాను. దానితో నామనస్సుకు వెర్రెత్తినట్లయింది. అప్పుడు నేను కళ్లార చూచినదంతా నా స్మృతిపథంనుంచి మాయమైనప్పటికీ, అదంతా యథార్థమని నేను నమ్ముచున్నానాఅని నన్ను నేనే ప్రశ్నించుకొంటున్నాను

కాని ఆ ప్రశ్నకు నేనే జవాబు చెప్పలేను. నా ప్రాణం తల్లడిల్లి సమూలం తలక్రిందులైంది. నాకు నిద్రఅనేది లేకుండా అంతర్ధానమైంది. రాత్రి పగలూ సదా సర్వ కాల సర్వావస్థలయందూ అతిఘోరమైన భీతి ఒకటి నన్ను వెంటాడుతూ ఉంది. నారోజులు సమీపించిన వనిన్నీ నేనిక మరణించక తప్పదనిన్నీ, ఇదంతా నమ్మలేనిస్థితిలోనే మరణించక తప్పదనిన్నీ నాకు గట్టిగా తోస్తోంది. ఆమనిషి తాను చేసిన కొన్ని నీతి మాలిన దుష్కార్యములగూర్చి నాతోచెప్పి వెల్లడించి నప్పుడు, అతడు పశ్చాత్తాపంతో కంట తడిపెట్టి నప్పటికీ, ఆ విషయములను నేను తిరిగీ జ్ఞప్తికి తెచ్చు కొంటే నా గుండె చెదిరిపోతుంది. కాని, అట్టర్సన్! నీకొక్క విషయం మనవిచేస్తాను. నామాటను నీవు త్రోసివేయకుండా గౌరవిస్తే అంతే చాలు. నాముందు జెకిల్ స్వయంగా ఒప్పుకొని చెప్పినదానినిబట్టి, ఆరాత్రి నాయింటికివచ్చిన ఆవ్యక్తి 'హైడ్'అనే పేరుగలవాడు. క్యారూను హత్యచేసి, దేశమంతటా దశదిశల వేటాడు చున్నప్పటికీ కన్పించని వ్యక్తి అతడు—

హాస్టీ లాన్యన్.

(ఇంకా వుంది)

# పాత గొడుగు

(37-వ పేజీ తరువాయి)

సులోమాత్రం తన దురదృష్టానికి తన్ను తాను నిందించుకుంటూనే వున్నాడు.

ఇంతలో ప్లీడరుగారిఅన్నకుమారుడు అక్కడికి వొచ్చాడు.

"నిన్నరాత్రి మెయిలుకి వొస్తానని బాబాయి వుత్తరం రాశాడు. తప్పకుండా స్టేషన్లో కలుసుకోమనికూడా రాశాడు. రామమందిరంలో పురాణంవింటూ అసలావిషయాన్నే మరిచిపోయాను. తీరా స్టేషన్లో బండికూత వినిపించేసరికి ఆవిషయం జ్ఞాపకానికి వొచ్చింది. చివుక్కున లేచి పరుగెత్తాను. వర్షం పడుతోండడంమూలాన మనవాళ్ళ గొడు గేదయినా అవుపిస్తుందేమోనని నడవలో గొడుగులన్నీ గాలించాను. చివరికి ఓమూలనున్న మన కొత్తగొడుగుని ఆనవాలుకట్టి పట్టుకుని పరుగెత్తాను. మీాకు చెప్పడానికయినా తడవు లేకపోయింది" అంటూ చేతనున్న గొడుగు ప్లీడరుగారిముందు పెట్టాడు.



ఆ గొడుగునిచూచేసరికి శాస్త్రిగారికళ్లు గిర్రున తిరిగిపోయాయి. రాత్రి తను తస్కరించదలచుకున్న గొడుగు అదే.

"ఆఁ...ఏఁవిఁటీ ? అలాగా ? అయితే యీ గొడుగు ఎవరిదో పాపం! నాగొడుగు కనిపించకపోయేసరికి నేనే పొరబాటుపడ్డానల్లేవుంది. అయ్యోపాపం! ఎవరిదోయిది" అని రమణయ్య పంతులుగారంటోంటే, శాస్త్రిలుగారు గుటకలు మింగుతూ కూచున్నారే కాని, గొడుగు'నాద'ని చెప్పలేకపోయారు.

పాపం! ఎలా చెబుతాడు? ఇంతసేపూ తనది కాదన్నట్టు ప్రవర్తించిన ఇప్పుడు తనదేనని చెప్పడం యెలాగ ? - పోనీ, చెబితే మాత్రం పంతులుగారు నమ్మతారా? - చూస్తూ చూస్తూ రెండు గొడుగులూ పంతులుగారిచేత బెట్టి, సెలవు పుచ్చుకుని యేడుస్తూ ఇంటి మొహం పట్టాడు. అంతకంటే చేసేదేముంది గనక?... ★



పీటర్ పాన్ ఒక్కడే ఉయ్యాలలో పడుకుని బూరా ఊదుతున్నాడు.

(సీరియల్)

## వాల్ట్ డిస్నీ కార్టూన్ చిత్రం

**(12)** ఆరోజు రాత్రి భూగృహంలో పిల్లలందరూ వరసగా కూర్చుని భోజనాలు చేస్తున్నారు. వెండీ అందరికీ అమ్మ గనక వడ్డన చేస్తోంది. ఇన్నాళ్ళకి తమకొక అమ్మ దొరికినందుకు పిల్లలు మహా సంతోష పడుతున్నారు. పీటర్ ఏదో రాచకార్యంమీద ఎక్కడికో వెళ్ళాడు. అతడు లేడు కనక అతని కుర్చీలో కూర్చునే గౌరవంకోసం పిల్లలు తమలోతాము దెబ్బలాడుతున్నారు. ఒకళ్ళమీద ఒకళ్లు పితూరీలు చెబుతూ గల్లంతు చేస్తున్నారు. వెండీ పిల్లందర్నీ అదుపు చెయ్యడానికి సతమతమవుతోంది.

ఇంతలో పీటర్‌పాన్ వచ్చాడు. "మీ నాన్న వచ్చాడు. గోల చెయ్యకండి," అని వెండీ పిల్లల్ని గదిమింది. పిల్లలు భయపడినట్టు నటించి నోళ్లు మూసుకున్నారు. పీటర్ తన జేబులోంచి ఉత్తుత్తి తినుబండారాలు అందరికీ విసిరేశాడు. వాళ్లు కనుబొమ్మలెగరేస్తూ, ఒకర్నొకరు ఊరించుకుంటూ తిన్నట్టు నటించారు.

వెండీమాట తోసెయ్యలేక పీటర్ ఒప్పుకున్నాడుగాని, నిజంగా అతనికి 'నాన్న'గా వుండడం యిష్టంలేదు. బయటికి చెప్పకోడు గాని, తల్లిలేని దిగులు అతని మనస్సును ఏదో మూల రంపంకోత కోస్తోంది. అందుచేతే అతను "నాన్నగా వుండను. నేను కూడా నీ కుమారుల్లో వొకణ్ణి. నువ్వు నాకు కూడా అమ్మవే," అని వెండీతో అన్నాడు. కాని వెండీకి అతడు 'నాన్న'గా తను 'అమ్మ'గా వుండడమే యిష్టం. ఈ విషయంమీద యిద్దరి మనస్సుల్లోనూ కొంచెం కలతలు రగిలాయి.

తోటి పిల్లల ఆటపాటల్లో పాల్గొనకుండా పీటర్‌పాన్ ఒక మూలకి పోయి బూరాలు తయారుచేసుకుంటున్నాడు. మిగతావాళ్ళు భోజనాలు కానిచ్చి ఎవళ్ల పక్కలమీద వాళ్ళు ముసుగులు కప్పుకుని పడుకుని, "కథ చెప్పవూ అమ్మా!" అని వెండీ నడిగారు. ఆమె కథ చెప్పసాగింది:

పీటర్ పాన్‌కూ, కెప్టెన్ హుక్‌కూ గొప్ప యుద్ధం జరిగింది.



"లండన్ ప్రయాణానికి సిద్ధంగా వుండండి" అంటున్నాడు పీటర్ పాన్






"అనగనగా ఒక వూళ్ళో ఒక భార్య, భర్త వున్నారు. వాళ్ళకి ముగ్గురు పిల్లలు న్నారు. ముగ్గురిలోకీ ఆడపిల్ల పెద్దది. మిగతా యిద్దరూ మగపిల్లలు...ఈ ముగ్గురు పిల్లల్నీ సంరక్షించేందుకు 'నానా' అనే కుక్క దాదిగా వుండేది. ఒకరోజున వాళ్ల నాన్నకి 'నానా' మీద కోపం వచ్చి దాన్ని తీసుకుపోయి పెరట్లో కట్టేశాడు. నాన్నా, అమ్మా పిల్లల్ని వదిలిపెట్టి ఎక్కడికో వెళ్ళారు. ఇదే సమయమని ముగ్గురు పిల్లలూ కిటికీలోంచి ఎగిరి స్వప్నద్వీపానికి పోయారు. నాన్నా, అమ్మా యింటికి తిరిగివచ్చి, పిల్లలు కనిపించక ఎంతో ఏడ్చారు. అమ్మ తన చిన్నారి పాపలపై దిగులు పెట్టుకుని కృశించిపోయింది...... పాపం ఆమె మనసెంత క్షోభించిందో మీకు తెలుసా?......"

కథ వింటున్న పిల్లలలో కొందరికి తల్లి మనస్సు ఎందుకు క్షోభించిందో అర్థం కాలేదు. వెండీ ఇంకా యిలా చెప్పింది:

"స్వప్నద్వీపంలో పిల్లలు ముగ్గురూ అక్కడున్న మిగతావాళ్లతోపాటు చాల యేళ్లు హాయిగా గడిపారు."

"వాళ్లు తమ యింటికి తిరిగి పోలేదా?" అని ఒక బాలుడు అడిగాడు.

"చెబుతా విను మరి. కొన్నేళ్ళయ్యాక వాళ్లు తమ యింటికి వెళ్ళారు. వాళ్లు ఇప్పుడు గుర్తుపట్టలేనంత పెద్దవాళ్లయ్యారు. ఆడపిల్ల అత్యద్భుతమైన సౌందర్యంతో వెలిగిపోతోంది. ఆమె తమ్ముళ్ళు మంచి దర్జాగా సూట్లూ బూట్లూ వేసుకుని టీక్ టాక్ గా వున్నారు ."

"వాళ్ళ పేర్లు చెప్పవ్ వెండీ?" అని ఒక డడిగాడు.

"ఆ అమ్మాయి పేరు వెండీ. ఆమె తమ్ముళ్ళ పేర్లు జాన్, మైకేల్. ఇంటికి వెళ్లేసరికి వారికి మేడమీద తెరిచివున్న కిటికీ కనిపించింది. తమకోసమే తమ తల్లి దాన్ని తెరిచి వుంచిందని వారికి తెలిసి, ముగ్గురూ యెగిరి కిటికీగుండా లోపలి కెళ్ళారు. వారిని చూసి వాళ్ళమ్మా, నాన్నా యెంత సంతోషపడ్డారనుకున్నారు..."

మూలకూర్చున్న పీటర్ పాన్ తన పని చేసుకుంటూనే ఈ కథంతా ఆసక్తితో విన్నాడు. విని ఇలా గన్నాడు:

"వెండీ! నువ్వు చెప్పింది అబద్ధం. తప్పిపోయిన పిల్లల తల్లులు కిటికీలు తెరిచి వుంచుతారనుకున్నావా? ఊహు. తెరిచి వుంచరు. నేనూ మొదట నీలాగే అనుకున్నాను. నేనొకసారి మా యింటికి తిరిగి వెడదామనిపించి వెళ్ళాను. కాని మా కిటికీ తలుపులు మూసివున్నాయి. మా అమ్మ నన్ను మరిచిపోయింది. నే నిదివరకు పడుకునే వుయ్యాలలో మరొక పాపాయి పడుకుని వున్నాడు."

ఈ మాటలతో వెండీ, జాన్, మైకేల్లకు భయం వేసింది. తమకుకూడా అటువంటిదే జరుగుతుందేమో ననిపించింది. వెంటనే ముగ్గురూ యింటికి వెళ్ళిపోదామనుకున్నారు. మిగతా పిల్లలందరూ వెళ్ల వద్దని బ్రతిమాలారు. కాని వారు వినిపించుకోలేదు. కావలిస్తే తమతోపాటు అందర్నీ తీసుకువెడతామనీ, తమ తలిదండ్రులు వాళ్లందర్నీ పెంచుకుంటారనీ చెప్పారు. తల్లుల నెరగని పిల్లలకి ఈ సలహా నచ్చింది. అందరూ లండన్ నగరానికి వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.

పీటర్ పాన్‌కు వీరి ప్రయాణం ఏమాత్రం యిష్టంలేదు. మూతి బిగించుకుని వున్నాడు. ఎవ రెక్కడికిపోయినా తనుమాత్రం స్వప్న ద్వీపంనుండి కదలనన్నాడు. కారణమడిగితే "నే నెప్పుడూ బాలుడుగానే వుండిపోతాను," అన్నాడు.

మిగతా వారందరూ బయలుదేరారు. పీటర్ టింకర్ బెల్‌ను పిలిచి, వాళ్లను జాగ్రత్తగా సముద్రం దాటించి తీసుకుపోవలసినదని ఆజ్ఞాపించాడు. వెండీ పీటర్‌తో "నీ ఆరోగ్యం జాగ్రత్త." అని మరీ మరీ చెప్పింది.

పీటర్ ఒక్కడే తన ఉయ్యాలపై పడుకుని బూగా వూగుకుంటున్నాడు.

**(13)** వెండీ మొదలైనవారు చెట్టు తొర్రలలోంచి బయటికి వచ్చారో లేదో అక్కడ సిద్ధంగా పొంచి దాక్కున్న కెప్టెన్ హుక్ మనుషులచేతుల్లో చిక్కుకున్నారు. భూగృహరహస్యం ఎలా తెలిసిందో, కెపెన్ హుక్ తన అనుచరులతో సహా చెట్టుతొర్రలవద్ద నిశ్శబ్దంగా కాపలా కాశాడు. తొర్రల్లో ముఖాలు పెట్టి, అడుగున వెండీవాళ్ల మాటలన్నీ విన్నారు. వాళ్లు బయటికి రాగానే పట్టుకోమని హుక్ ఆజ్ఞాపించాడు. పిల్లలు కేకలు వెయ్యకుండా నోళ్లు నొక్కి, కాళ్లూ చేతులు కట్టేసి, తమ ఓడలోకి మోసుకుపోయారు.

కాని దేవకన్య టింకర్ బెల్ మాత్రం సముద్రపు దొంగలచేతులో పడకుండా తప్పించుకొంది. గబగబ పరుగెత్తుకొచ్చి పీటర్‌తో జరిగిన ప్రమాదమంతా చెప్పింది. వెంటనే పీటర్ తన బాకు తీసుకుని లేచాడు. క్షణంలో దానికి పదును పెట్టాడు. "ఈసారి వాడో నేనో తేలి పోవాలి," అని ప్రతిజ్ఞచేశాడు.

ఓడలో పిల్లలందరూ బంధించబడి వున్నారు. ఆ రాత్రే, వారిని సఫా చెయ్యడానికి కెప్టెన్ హుక్ కృతనిశ్చయుడై వున్నాడు. ఈ విపత్సమయంలో పీటర్ పాన్ బాకుదూసి, చడీ చప్పుడూ లేకుండా ఓడలో ఒకగదిలో దూరాడు. అక్కడున్న దీపం కాస్తా ఆర్పేశాడు. తరవాత కోడి లాగ అరిచాడు. ఈ అరుపుకు దొంగలందరూ భయపడ్డారు. పిల్లలకి మాత్రం పీటర్ పాన్ తమ్మురక్షించడానికి వచ్చాడని ధైర్యం కలిగింది.

ఆ గదిలో ఏముందో చూసిరమ్మని కెప్టెన్ హుక్ ఒక అనుచరుణ్ణి పంపించాడు. వాడు వెళ్లకపోతే హుక్ చంపుతాడేమోనని, వెడితే ఆ గదిలోవున్న భూతం చంపుతుందేమోనని భయపడుతూనే వెళ్ళాడు. మళ్ళీ తిరిగిరాలేదు.

వాడి తరవాత ఇంకోణ్ణి, వాడి తరవాత ఇంకోణ్ణి కెప్టెన్ హుక్ ఆ భూతపుగదిలోకి పంపించాడు. వెళ్ళినవాళ్లెవరూ తిరిగి రాలేదు ఆతరవాత లోపలి కెళ్లడానికి ఎవడూ సాహసించలేదు. హుక్ చంపుతానని బెదిరించినా ఒక్కడూ ముందుకు అడుగువెయ్యలేదు. పైగా కట్టుకట్టి తమ యజమానిమీదే తిరగబడడానికి సిద్ధమయ్యారు. ఈ అలజడిలో గదిలోంచి పీటర్ బయటికివచ్చి తన స్నేహితులందరి బంధాలూ విడిపించి దాక్కున్నాడు. కాని వాళ్లు దాక్కోడాని కిష్టపడక ఆయుధాల గదిలోకివెళ్లి తలొక కత్తీ తెచ్చుకున్నారు.

ఇదంతా చిటికెలో జరిగిపోయింది. పీటర్ తరఫువారికీ, కెప్టెన్ హుక్ తరఫువారికీ సంకుల సమరం జరిగింది. చివరికి దుష్టశక్తులే ఓడిపోయాయి. కొందరు దొంగలు ఓడమీదే చచ్చారు. కొందరు నీళ్లలోకి తోయబడ్డారు. కెపెన్‌కూ పీటర్‌కూ ఘోరమైన యుద్ధం జరిగింది. పీటర్ అసమానమైన ఖడ్గవిద్యానైపుణ్యం ప్రదర్శించాడు. ఎన్ని మాయోపాయాలు చేసినా కెప్టెన్ హుక్ జయించలేకపోయాడు. చివరికిక తన కెలాగూ చావుతప్పదని హుక్ సముద్రంలోకి దూకాడు. అక్కడ అతని కోసం మొసలి సిద్ధంగావుంది. ఒక్క గుటకతో హుక్‌ను మింగేసింది. పిల్లలు రక్షింపబడ్డారు. శత్రు పీడ తొలగిపోయింది.

(48 వ-పేజీ చూడండి)

పిల్లలందరూ ఓడమీద లండన్ బయలుదేరారు.

★

పీటర్ పాన్ వెళ్ళినదిక్కే చూస్తూ కిటికీవద్ద కూర్చుంది వెండీ.



## ★ పీటర్‌పాన్ ★

(46-వ పేజీ తరువాయి)

**(14)** ఇప్పుడు సముద్రపు దొంగల ఓడకు పీటర్‌పాన్ కెప్టెను. లండన్ ప్రయాణానికిసిద్ధంగా వుండండని అనుచరులకుఆజ్ఞలిచ్చాడు.

**(15)** విజయగర్వితులైన పిల్లలతో ఓడ ఆకాశ పథాని కెగిరింది. అడ్డంవచ్చే మేఘాలను చీల్చుకుని అతి వేగంతో ఓడ ప్రయాణం చేసింది. తమంత తామే యెగిరి అలిసిపోవలసిన అవసరం లేకుండా, పిల్లలు సుఖంగా పయనించారు.

**(16)** ఇంటికి చేరి పెరట్లో దిగారు. లోపల తల్లీ, తండ్రీ తమ పిల్లలకోసం విచారిస్తూ కూర్చున్నారు. అమ్మ కిటికీతలుపులు తెరిచే వుంచింది. ఏ కిటికీగుండా తన చిన్నారి బిడ్డలు యెగిరిపోయారో, ఆ కిటికీగుండానే వారు తిరిగివస్తారని ఆమెకు ఒక ఆశ. కొంతసేపటికి నాన్న నిద్రపోయాడు. అమ్మ పియానో వాయిస్తూ,

"తెరిచిన కిటికీగుండా
తిరిగి రండి తిరిగి రండి!
చిన్నారి పాపలార!
నా
కన్నులలో పాపలార!
కాలాంతమువరకు నేను
కనిపెట్టుకు కూర్చుందును
రండి రండి పాపలార!
నా
గుండెలలో జోతులార!

అని అత్యంత విషాదంగా పాడుతోంది.

ముందుగా కిటికీలోంచి గదిలోకి తొంగి చూసిన పీటర్ ఆ పాటవిని మెల్లిగా కిటికీతలుపులు మూసివేశాడు. మూసిన తలుపులు చూసి వెండీ తన తల్లిమీద నిరాశచేసుకుని తనతో స్వప్నద్వీపానికి వచ్చేస్తుందని అతడాలోచించాడు. కాని మళ్ళీ వెండీ అమ్మముఖం చూసేసరికి, ఆమె పియానో మీద తలవాల్చి, బొటబొట కన్నీళ్ళు కార్చడం కనిపించింది. అతని హృదయం కరిగిపోయింది. మళ్లీ కిటికీతలుపులు తెరిచాడు. వెండీ, జాన్, మైకేల్ లోపలికి వచ్చారు. వాళ్ళమ్మకు కనిపించకుండా ఎవరి పక్కలమీద వాళ్లు పడుకుని ముసుగులు పెట్టుకున్నారు. అమ్మ తలయెత్తి చూసేసరికి ముగ్గురూ గుర్రుపెడుతున్నారు. ఆమె పట్టరాని సంతోషంతో వారిని కౌగిలించుకుంది. వారియింట్లో మళ్లీ యెప్పటిలాగానే ఆనందం వెన్నెలలై, వెల్లువలై విరిసింది.

వెండీ తనతో తెచ్చిన స్వప్నద్వీప బాలులను తల్లికి చూపించింది. వాళ్ళని స్వీకరించడానికి ఆమె అంగీకరించింది. పీటర్‌పాన్ మాత్రమే తిరిగి తన రాజ్యానికి ప్రయాణమయ్యాడు. అతడు వెడుతూంటే వెండీ ఎంతో బాధపడింది. "ఏడాదికొకసారి స్వప్నద్వీపానికి వస్తూంటానులే" అని అతణ్ణి సముదాయించింది. ఇద్దరూ పరస్పరం వీడ్కోలిచ్చుకున్నారు.

పీటర్‌పాన్ టింకర్ బెల్‌తో కలిసి దూరంగా యెగిరిపోయాడు. అతడు కనిపించేవరకూ వెండీ కిటికీవద్దనే కూర్చుని చూసింది. అతడు మాయమయ్యాక కూడా చంద్రబింబం మీదుగా ఎక్కడెక్కడికో తెలియని దూరదూర దేశాలకు ప్రయాణం చేసే మేఘ నౌకలను చూస్తూ, నిట్టూర్పులు వినుసూ కూర్చుంది.

(సమాప్తం)

## ★ "సురంగ్" ★

ప్రదిహేనేళ్లకు పైగా భారతీయ సినిమా రంగంలో శాంతారాంకు ఒక విశిష్ట స్థానమున్నది. ప్రేక్షకులలోను, విమర్శకులలోను ఇంత గొప్పదర్శకుడు లేడనేవారూ ఆయన పేరు చెబితే మూర్ఛపోయేవారూ ఉన్నారు; ఆయనలో ప్రత్యేక విశిష్టత యేమీ లేదనేవారూ ఉన్నారు. మొత్తంమీద ఒకటి నిజం. ఈయన తీసే ప్రతి కొత్తచిత్రం కోసం ఆసక్తితో యెదురుచూసేవారు మన దేశంలో చాలమంది వున్నారు. ఈయన చిత్రాల్లో బాగా ఆర్థికవిజయం పొందినవీ వున్నాయి; సామాన్యంగా నడిచినవీ ఉన్నాయి. చిత్రమంతటా ఆయన దర్శకత్వం ఒక్కస్థాయిలో వుండదు. కొన్నిచోట్ల ఉత్తమంగా, కొన్నిచోట్ల అతి చవకబారుగా కనిపిస్తుంది.

"సురంగ్"లో కార్మికులకూ యజమానికీ సంఘర్షణ కథావస్తువు. కార్మికులను యజమాని తన పుత్రులవలె ప్రేమించాలనీ, వారిలో ఒకడుగా, తోడునీడగా మెలగాలనీ సారాంశం. దయారాం అనే యజమాని అతిక్రూరుడు; రాక్షసప్రవృత్తి కలవాడు. అతని కొడుకు అశోక్ కేవలం అశోకచక్రవర్తివంటి పరమదయాళువు. దయారాం తనక్రింద పనిచేసే కార్మికులను హింసిస్తూ వుంటాడు. అశోక్ ఇది సహించలేక కార్మికులలో కలిసిపోయి వారితోనే జీవిస్తూంటాడు. చివరికి దయారాం కార్మికులపై పగతీర్చుకోడానికి వారు పనిచేస్తున్న సొరంగాన్ని డైనమైట్‌తో ధ్వంసం చేయ ప్రయత్నిస్తాడు. కాని ఆ ప్రయత్నంలో తనే నశిస్తాడు. అతని తరవాత యజమాని అయిన అశోక్ కార్మికులను తనతో సమానంగా ఆదరిస్తాడు.

ఈ చిత్రంలో బాగా బలహీనంగా కనిపించే పాత్ర అశోక్‌ది. అశోక్‌గా నటించిన వినోద్ కుమార్ వల్ల ఆ పాత్ర మరింత పాడయింది. నిస్సహాయ, అబల అయిన స్త్రీలాగ నటించడంవల్ల ఆపాత్రపై మనకెట్టి సానుభూతీ కలగదు. అటువంటి అసమర్థుడివల్ల కార్మికులుకాని, ఎవరుగాని పొందే ప్రయోజనం శూన్యం. కార్మికులుకూడా సరిగ్గా అతడి సమానాలోనే చిత్రించబడ్డారు. కథకు కేంద్రపాత్రలైన అశోక్‌ను, కార్మికులను కేవలం అసమర్థులుగా చిత్రించడంవల్ల కథ పేలవమైంది.

ఈ చిత్రంలో ప్రత్యేకించి ఫొటోగ్రఫీ, శబ్దగ్రహణం బాగున్నాయి. 'టైటిల్స్' చూపించేభాగం కొత్తవిధానంలో చిత్రించబడింది. పాటలుకూడా బాగా నేవున్నాయి. పాటలు ఏ సన్నివేశంలో పెట్టవచ్చునో, ఏ సన్నివేశంలో పెటగూడదో మన దర్శకులు ఇంకా నేర్చుకోవలసివుంది. అశోక్ చెల్లెలైన రాణి అరణ్యమార్గాన గుర్రంపై స్వారీచేస్తూ అద్భుతంగా పాడేస్తుంది. కథలో మరొక ప్రధానపాత్ర అయిన ఉన్మాదిని యీతకొడుతూ, ఎక్కడా వగర్చకుండా సునాయాసంగా పాడేస్తుంది. తెలుగు "దేవదాసు"లో బాగా తాగివున్న దేవదాసు రాగ, లయ బద్ధంగా పాడడం ఎంత అసహజమో, గుర్రంమీద స్వారీ చేస్తూ, యీతకొడుతూ అలిసిపోయిన వ్యక్తులు పాడడం కూడా అంతే అసహజం. (పాడేది ప్లేబాక్ మనిషిగనక దండాలు, బస్కీలు తీస్తున్న పాత్రకుకూడా ఆహ్లాదకరమైన పాటలు పెట్టవచ్చు.)

యజమానిగా ఉల్హాస్, అతని కుమార్తెగా శీలారమణి, ఉన్మాదినిగా శశికళ నటించారు. ఈపాత్రల్లో ఏ ఒక్కటీ విశ్వసనీయంగా లేదు. ఉన్మాదిని ఉన్మాదం ఎక్కడుందో తెలియదు; ఎక్కువసేపు

(50-వ పేజీ చూడుడు)



నిన్ను బురదలోంచి తెచ్చాను. కాని, సద్మార్గానికి బదులు— పాడు వత్తగుల్ల వయ్యావు.

శాం: ఏంమాటలు...? మీరేనా యిలా మాటాడవలసింది? నేనేపాపం యెరగను. నన్ను నమ్మరూ...?

చం: నమ్మానే భామా, నమ్మాను. నమ్మే నా స్థితి యింతకి దిగజారింది. నలుగురిలో నగుబాటయింది. కన్నవాళ్లు డబ్బుపంపడం మానేశారు. చదువు చెడింది. సంఘంలో మర్యాదపోయింది. ఇవన్నీ పోయినా నువ్వున్నా వనుకున్నాను.

శాం: చెప్పండి, నే నేమయ్యాను? (యేడుస్తూ) నే నేంకాలేదు. మీ పాదాల వద్దే ఉన్నాను. నామాట నమ్మండి.

చం: ఇక్కడే వుండి—నాటకం సాగిస్తున్నావ్.

శాం: ఛీ ఛీ...అలాంటిది అనుకోకండి. నా అణువణువూ మీకోసం అర్పిస్తాను. నేనేమీ ఎరగను. ఏవో అపవాదులు విని వుంటారు.

చం: అపవాదులా...? నీకు కొత్తేముంది? పాతజీవితాన్నే యిక్కడా ప్రారంభించావ్...

శాం: అబద్ధం. నన్ను నరికినా భరిస్తాను. కాని, అభాండం వెయ్యకండి. నేను...మీ పాదాలసాక్షిగా...నా సమస్తాన్నీ మీ కర్పించాను.

చం: అర్పించావ్...ఆ మాస్టారుకీ...

శాం: ఛీ! అలాంటిమాట లనకండీ, మీకు పుణ్యం ఉంటుంది. అతనే నన్ను బలవంతం చెయ్యబోతే, యెదిరించాను.

చం: నాతో యెందుకు చెప్పలేదు...?

శాం: చెప్పకపోవడం పొరబాటని అనుకోలేదు. క్షమించండి.

చం: అదే అసలు రహస్యం. సరే, జరిగిందేదో జరిగింది......యిక నీకూ నాకూ కుదరదు.

శాం: అదేంవిటి? నన్నొదిలేస్తారా...?

చం: హా...నేను వదిలేదేముంది? నువు తిరిగి పాతకొంపకే చేరతావు. హాయిగా ఉంటావు. కాని, నాకేం గతి ఉంది? సంఘం - మర్యాదా అన్నీ కోల్పోయాను.

శాం: వొద్దు - అలా అనకండి. నన్ను నమ్మరూ...

చం: లేదు - నమ్మను - నమ్మలేను.

శాం: (నిట్టూర్చి) నమ్మరు! ఎందుకు నమ్మతారు...? మీరు మగవారు—నేను ఆడదాన్ని.

చం: ఆడదానివి కనకనే బ్రతగ్గలవు.

శాం: నన్ను నమ్మించి యీ కొత్త జీవితంలోకి మళ్ళించారు. నా అణువణువునా మిమ్మల్ని ప్రేమించాను. అలానే జీవించాను. ఆడది హృదయం యిస్తే, తిరిగి తీసుకోలేదు. అది చేతకాదు. ఆ దౌర్బల్యం వల్లనే మీరు నాకింత శిక్ష విధించగలుగుతున్నారు. ఆనాడు మీ కళ్ళు మూసుకుపోయి, నన్ను తెచ్చారు. ఇలాగ వేధించి, నన్ను జీవచ్ఛవాన్ని చేసి తరుముతున్నారు. ఇదేనా న్యాయం...?

చం: అధికప్రసంగం అనవసరం.

శాంత: నీలాంటి పిరికిపందలకీ, ఉత్తరకుమారులకీ అనవసరం. నిజమే! ఇదేగా నన్ను ఉద్ధరించే విధానం? కీర్తికోసం నన్ను తెచ్చి సంఘంలో జూదమాడా లనుకున్నావ్. ఆటలో గెలిస్తే కీర్తి దక్కేది; నన్ను దక్కించుకునేవాడివి. దురదృష్టవశాత్తూ వోడిపోయావ్. అందుకే నన్ను తిరిగి తరుముతున్నావ్. ఆఖరుసారి నా ప్రార్థన వినవూ...నీ పాదాలవద్ద కాస్త చోటివ్వవూ? నీ హృదయం కరగడం లేదా...?

చం: లేకేం, అగ్నిపర్వతం పగులుతోంది.

శాం: పగలనీయ్ ..దాంతో, నువ్వూ నేనూ యేకంగానే నాశనమవుదాం.

చం: అక్కడకూడా నీ సాహచర్యం యెందుకు...? సిగ్గులేకా...?

శాం: సరే, నీ వొక్కడవే సాధించు ఆ స్వర్గాన్ని. సెలవ్...గుర్తుంచుకో...ఆడదాని. జీవితంతోమాత్రం ఇకముందైనా జూదమాడకు.

[ఫ్లాష్‌బాక్ ముగిసిన ధ్వనులు]

[కమల ఇంటో]

కమ: ఇదా ఆఖరికి జరిగింది...?

శాం: (ఏడుస్తూ) ఇదే నక్కా...

కమ: !భయేడవకు. జూదంలో పావులం ఆడవాళ్ళం, అంతే!

[దూరంనించి గుడిగంటల మధ్య]

ఓం అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

కమ: ఏ దబద్ధం? ఏది చీకటి...? యేది మృత్యువు? అంతా అబద్ధం. ఒక్కటే పరమ సత్యం. ఈ ఆడదాన్ని. సహస్రవిధాల అణచి, చీల్చి, అనుభవించి, ఆనందించి, నిప్పుల్లోకి తోసేస్తారు...నీళ్లు పోస్తారు. అంతే! అది సృష్టిధర్మంగా చెలామణి అవుతోంది.

శాం: ఇంకేం గతి లేదా అక్కా...?

క: లేకేం చెల్లీ. ఆడది అమృతభాండం కాగలదు. అగ్నిపర్వతం కాగలదు. పద!.. ఆవేశాలు నిగ్రహించుకుంటే ఆడది బ్రతకగలదు. లేదా, మనకి మనమే మృత్యుముఖాలవుతాం.

చంద్రం: (బయటనించి) శాంతా! శాంతా!

శాం: తలుపు తీయకు అక్కా...యిక అతని ముఖం చూడలేను.

క: సరే.

చం: శాంతా! శాంతా!

[అని పిలుస్తూంటే ఫేడవుట్.] ★

## ★ కాలక్షేపం ★

(4-వ పేజీ తరువాయి)

రాజ్యంగా ఉండాలని షేక్ అబ్దుల్లా సాగించిన ఉద్యమానికి అమెరికావారు వెనుకనుంచి తాడు లాగిరి కాని, ఆ సారస్యంబు త్రాడు ("సారాచెంబు త్రాడు") తెగిపోయింది.

పాకిస్తానుకు అమెరికావారు సైనిక సహాయం చేయడానికి సిద్ధమవుతున్నారనిన్నీ, అమెరికావారు సైనిక స్థావరములను పాకిస్తాన్ యిస్తాన్ అంటున్నదనిన్నీ తంతివార్తలు - కాదు కాదు - వితంతు వార్తలు - కొన్ని వెధవ వార్తలు వినవస్తున్నాయి.

పాకిస్తానుకు, అమెరికావారి సహాయం ప్రాప్తిస్తే, భారతదేశానికి రష్యా సహాయం ప్రతిక్రియ అయితే-ముక్కాకొటుకు చెప్పుదెబ్బ పనిచేయునా? సామ్రాజ్యవాదానికీ, సామ్యవాదానికీ మధ్య, భారతీయ సౌమ్యవాదం ఏమవుతుంది? అందుకనే పండిత జవహరిలాలు నెహ్రూగారు తస్మాత్ జాగ్రత! జాగ్రత! అని భారతజాతిని హెచ్చరిస్తున్నారు.

ఐక్యరాజ్యసమితి పీఠానికి నెహ్రూగారి సోదరియైన పండిత విజయలక్ష్మిగారిని అధ్యక్షిణిగా ఎన్నుకొనుటకు అంగీకరించి అభిమానించిన అమెరికా ప్రభుత్వం - భారతదేశానికి అడిగినంత అప్పు యిస్తున్న అమెరికా ప్రభుత్వం-పాకిస్తాన్‌లోనే తన పటాలపీఠం ఏర్పాటు చేసికొని మనకు మరింత సన్నిహితంగా ఉంటే మనకు లాభమా? నష్టమా? రష్యాతో మనం పొత్తు కలిసి మాస్కో యాత్రీకులమైతే మనకు ప్రాప్తించేది మోక్షమా! నరకమా? దారి తెన్ను తెలియని అంధకారం యీ అంతర్జాతీయ రాజకీయం అని గ్రహించినప్పుడే మనము పండితులం. ★

## "సురంగ్"

(48 వ పేజీ తరువాయి)

తెలివి తేటలతో నే వ్యవహరించింది.

మొత్తంమీద యీ చిత్రం శాంతారాం పేరు ప్రతిష్ఠలకు తగినది కాదని నిస్సంశయంగా చెప్పవచ్చు. ★

## కళాసమితి

ఈనెల 13 వ తేదీన త్యాగరాయనగర్, వాణీమహల్ లో కళాసమితి ప్రారంభోత్సవం జరిగింది. సంగీతం, నృత్యం, నాటకం మొదలైన లలితకళలలో అభిరుచి గలవారికి అవకాశాలు కలిగించడానికి, కొందరు ఉత్సాహవంతులైన యువకులు ఈసమితిని స్థాపించారు.

జస్టిస్ ఏ. ఎస్. పి. అయ్యర్ అధ్యక్షతన ప్రారంభసభ జరిగింది. దేవీ ప్రసాద్ రాయ్ చౌదరిగారు ప్రారంభోపన్యాసం చేశారు. కళాకారుడు ద్రష్ట అనీ, మంచి చెడు మొదలైన విలువలను సామాజికులకు ఎంచి చూపడం అతనివిధి అనీ ఆయన అన్నారు. సంప్రదాయ సిద్ధమైన కళ అంటూ ఏమీ లేదనీ, ఒక్కొక్క కళాకారుడి వ్యక్తిత్వ ప్రభావంవల్ల కళరూపం మార్చుకొని అభివృద్ధి అవుతూ వుంటుందనీ ఆయన అన్నారు.

అధ్యక్షోపన్యాసం చేస్తూ జస్టిస్ ఏ. ఎస్. పి. అయ్యర్, ప్రాచీన భారతదేశం లలితకళలలో ఎంత ఉన్నతశిఖరాలందుకొన్నదీ, భారతీయ కళల ప్రభావం ఇతరదేశాలకు కూడా ఎలా ప్రసరించిందీ వివరించారు. పూర్వౌన్నత్యాన్ని తిరిగి స్థాపించడానికి యువకులు ముందుకు రావాలని ఆయన ఉద్బోధించారు. వివిధలలితకళల భిన్న భిన్న తత్త్వాలను, వాటి ఏకత్వాన్ని నిరూపిస్తూ ఆయన మాట్లాడారు. కళాసమితి దినదినాభివృద్ధి పొందాలని ఆయన ఆశీర్వదించారు.

తరవాత నృత్య నాటకప్రదర్శనాలు జరిగాయి. కిశాంబి రాజకుమారి, శ్రీమణి మున్నుసవారు చేసిన నృత్యాలు ప్రేక్షకుల ప్రశంసలు అందుకొన్నాయి. "లబ్బీ" [illegible] ఒక ఇంగ్లీషు నాటిక నటనదృష్ట్యా ఉత్తమంగా వుంది. సురజూపావారి "ప్రాస్తన్య" గేయకథ నృత్యప్రదర్శనంకూడా ప్రేక్షకులను అలరించింది.

ఈ సభకు ప్రేక్షకులు విరివిగా హాజరయ్యారు. సినిమా డైరెక్టర్లు, నటీనటులు కూడా పలువురు వచ్చారు. ★

## ★ సినిమా వార్తలు ★

యూనైటెడ్ టెక్నిషియన్స్ ఎండ్ శ్యామలావారి "పల్లెపడుచు" చాలవరకు పూర్తయినట్లు తెలుస్తోంది. జమీందారిణి పాత్రకు జి. వరలక్ష్మిని బుక్ చేశారట.

* * *

"చంద్రహారం" జనవరి మొదటివారంలో విడుదల చేయడానికి శీఘ్రసన్నాహాలు జరుగుతున్నాయి. విజయావారు ఆతరవాత "మిస్సమ్మ" అనే సాంఘికచిత్రం నిర్మిస్తారట. స్క్రిప్టు చక్రపాణిగారే వ్రాశారు.



దొంగతనం మోపి నారాయణను పోలీసులు లాక్కుపోతుంటే తోటి రిక్షావాళ్లందరూ విచారిస్తున్నారు.

గోకుల్ వారి "నిరుపేదలు"లో నాగేశ్వరరావు, జమున మున్నగువారు.

యునైటెడ్ ఎక్జిబిటర్స్ & శ్యామలా వారి "పల్లెపడుచు"లో బావచంద్రంగా రామశర్మ,
మరదలు కాంతంగా కృష్ణకుమారి.

★

విజయావారి "చంద్రహారం"లో చందనరాజు వినోదార్థం ఏర్పాటుచేసిన 'కలువలు—చంద్రుడు' నృత్యం



 ఘంటారావం 

## (11-వ పేజీ తరువాయి)

గొట్టిపడి ఉంది. అక్కడక్కడ గోడలపై ఏవో లాటిన్, గ్రీక్ మంత్ర వాక్యాలు వ్రాసిన అట్టముక్క లున్నాయి. మొత్తానికి గదంతా చూస్తే క్లాడ్ ఫ్రాలో తన రహస్యప్రయోగాలు కొన్నాళ్ళుగామాని వేశాడని తెలుస్తుంది. ప్రస్తుతం అత డొక పెద్దగ్రంథం ముందు పెట్టుకుని చదువుతూ తనలో తనేదో గొణుగుతున్నాడు. "బంగారం! బంగారం! సూర్యుడు అగ్నిలోనుండి పుట్టాడు. చంద్రుడు సూర్యుని పుత్రుడు. విశ్వాత్మ అగ్ని అంటాడు జోరోస్టర్. అగ్ని అంశకు చెందిన పరమాణువులు విశ్వమంతటా వ్యాపించి ఉన్నాయి. ఇవే ఆకాశంలో సంచారం చేస్తూ ఒకదానిబాటలో మరొకటి కలుసుకున్నప్పుడు కాంతి జనిస్తోంది; భూమిపై కలుసుకున్నప్పుడు హిరణ్యం జనిస్తోంది. కాంతి, హిరణ్యం ఒక టేనని అతడి అభిప్రాయం! బాగుంది! అగ్నిలోనుంచి బంగారా న్నెలా తయారుచెయ్యడం? సూర్యకాంతిని ఒక పాత్రలో బంధించా లన్నమాట! కార్డోవా మసీదులో ఒక స్తంభంకింద అలా బంధించి దాచారట. కాని ఎనిమిదివేల ఏళ్ళవరకూ అది తియ్యకూడదు. అబ్బ!"

"అబ్బా! ఒక్క కాసుకోసం ఎనిమిదివేల సంవత్సరాలే!" అనుకున్నాడు జెహాన్. క్లాడ్ ఫ్రాలో తన ధోరణిలోనే మాట్లాడుకు పోతున్నాడు.

"బంగారం ఎలా తయారుచెయ్యడం? మెజిస్ట్రి ఏమన్నాడు? కొందరు స్త్రీల పేర్లలో మంత్రశక్తి ఉంటుందట. స్త్రీలను ఆదరిస్తే దేవుడు సంతోషిస్తాడట. వారి కాదరణలేని చోట దేవుణ్ని ప్రార్థించినా ప్రయోజనం శూన్యం. స్త్రీల పేర్లకు చివర దీర్ఘస్వరా లుండాలి. అవును అలావుంటే మధురంగా వుంటాయి. ఎమరాల్డా...అబ్బబ్బ! ఎప్పుడూ అదే ఆలోచన! ఎంత మరిచిపోవాలన్నా,రాకమానడం లేదే!" కోపంతో విసురుగా పుస్తకం మూసేశాడు. ముఖం చిటచిటలాడుతోంది... ముఖం తుడుచుకున్నాడు. తరవాత ఒక సుత్తీ మేకూ తీసుకున్నాడు: "కొన్ని రోజులనించి నా ప్రయోగాలన్నీ వ్యర్థమౌతున్నాయి. ఆమే మాటిమాటికీ కళ్లకు కట్టినట్లుంటోంది. ఎన్ని మంత్రాలు ప్రయోగాలు తెలిస్తే ఏం ప్రయోజనం? అసలు మంత్రమే తెలియడంలేదు. మంత్రించబడిన ఈ సుత్తితో ఈ మేకుని కొట్టినట్లయితే శత్రువు తక్షణం నశించాలి, ఫీబస్! ఫీబస్! చచ్చిపో! నరకానికి పో" అంటూ మేకు పక్కగోడ కానించి సుత్తితో కొట్టాడు. "నీలపురంగు నెరుసులొస్తే మంత్రం పారిందన్న మాటే" అనుకుంటూ సుత్తిదెబ్బలు కొట్టాడు. నెరుసులు రాలేదు. "ఛీ" అని సుత్తిని నేలకు విసిరికొట్టాడు. నిస్పృహతో కుర్చీలో కూలబడ్డాడు. కూలబడి మేజాపై గ్రంథం తీసి తేరి పారచూశాడు. హఠాత్తుగా ఏదో మాటదొరికింది. గబగబా గొణుక్కుంటూ లేచి సుత్తి, మేకు అందుకుని కొట్టసాగాడు.

"అయ్యయ్యో! అన్నకి వెర్రెత్తినట్టుంది!" అనుకున్నాడు జెహాన్.

క్లాడ్ ఫ్రాలో తిరిగివచ్చి కుర్చీలో కూలబడ్డాడు. రెండు చేతులల్లో తలపట్టుకుని కూర్చున్నాడు. మనస్సుకి క్లేశం వెయ్యా సవసరం లేక, స్వేచ్ఛాప్రవృత్తి కలవాటుపడిన తమ్మునికి, బలవంతాన అణగదొక్కబడిన వాంఛలు బలీయమైనప్పుడు సంభవించే భీభత్సం ఎలావుంటుందో తెలియదు. అన్న హృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలౌతున్నట్లు అతనికి తెలియదు.

ఈ పరిస్థితిలో అన్నను చూడ్డం భావ్యం కాదని జెహాన్ భావించాడు. మెల్లిగా తలుపు మూసి చప్పుడుకాకుండా ఎత్తెత్తి అడుగులువేస్తూ కొద్దిదూరం వెళ్లాడు. తరవాత గట్టిగా అడుగుల చప్పుడు చేసుకుంటూ తలుపువద్దకు వచ్చాడు. ఇది విని క్లాడ్ ఫ్రాలో పిలిచాడు "రండి! లోపలికి రండి! మీకోసమే చూస్తున్నాను, మాస్టర్ జాక్."

జెహాన్ లోపలి కడుగుపెట్టాడు. అతన్నిచూసి క్లాడ్ ఉలిక్కిపడ్డాడు. "నువ్వా జెహాన్!" అన్నాడు.

"జెహాన్ అయితేం, జాక్ అయితేం? అంతా ఒకటే పేరులో కొద్దితేడా. అంతే"

"ఎందుకొచ్చి నట్టిక్కడికి?"

తమ్ముని ముఖంలో వినయం, విధేయత, పశ్చాత్తాపం ఉట్టిపడుతున్నాయి.

"నిన్ను ఒక విషయం అడగాలని..."

"ఏమిటది?"

"ఏం లేదు...సలహా..." డబ్బు కావాలని అనలేకపోయాడు జెహాన్.

"నువ్వంటే నాకు అసహ్యం కలుగుతోంది."

తమ్ముడు నిట్టూర్పు విడిచాడు.

క్లాడ్ ద్వారంవైపుకు తిరిగి తమ్ముని వంక తీక్షణంగా చూశాడు. "నీతో మాట్లాడాలి" అన్నాడు.

దీని అర్థం తమ్మునికి తెలుసు. రాగలదానికి సిద్ధపడి నిలబడ్డాడు.

"రోజు రోజుకీ నీ దుష్ప్రవర్తనగురించి నాకు ఫిర్యాదులు వస్తున్నాయి. ఎవరినో కొట్టావుటగా? ఎందుకు?"

"ఓ! అదా! అధికారి కొడుకునని ధీమాతో వాడు గుర్రమెక్కి బురదలో పరిగెత్తించి అందరిపైనా బురద చిమ్ముతున్నాడు."

"పౌరుషం ఉంది కాని చదువు అంటలేదు."

"అన్నయ్యా! ఫీబస్ అంటే ఎవరు?"

క్లాడ్ స్తంభించిపోయాడు. తరవాత ఆలోచనలో పడ్డాడు. అతని ముఖం పాలిపోయింది. డబ్బడగడానికి ఇదే చక్కని అదను అనుకున్నాడు జెహాన్. అతి వినయంతో మృదువుగా ఇలా అన్నాడు. "ఏవో ఎవరో తెచ్చిన ఫిర్యాదులకి నామీద కోపం తెచ్చుకుంటావా అన్నా? వాళ్ళు దుండగులు. వాళ్లతో తలపడక ఎలా వీలౌతుంది నాకు?"

క్లాడ్ ముఖం ముడతలు పడింది" ఏంకావాలో అడిగేసెయ్యరాదూ?" అన్నాడు.

"ఏముంది?" అన్నాడు జెహాన్. అతని కీమాటు ధైర్యం వచ్చింది "కొంచెం డబ్బు కావాలి."

"మన ఎస్టేట్లమీదా, ఇళ్ళమీదా రాబడి సగం తగ్గిందని తెలుసా?"

"కొంచెం డబ్బు కావాలి."

"మనం చెల్లించవలసిన పన్నులు హెచ్చించారు."

"కొంచెం కావాలి."

"ఏం చేస్తావు, డబ్బు తీసుకుని?"

జెహాన్‌కి ఆశ కలిగింది. "పాడుచెయ్యడానికి కాదు; సద్వినియోగంకోసమే. నా స్నేహితులిద్ద రున్నారు. వాళ్లొక పేదసంసా

రంలో చంటిపిల్లకి వస్త్రదానం చేస్తున్నారు. నేనూ దానం చెయ్యాలని కోరిక కలిగింది."

"నమ్మదగినట్లే ఉంది నీ కథ! సిగ్గులేదూ అబద్ధాలు చెప్పడానికి?"

"ఫీబస్..."

క్లాడ్ నిశ్చేష్టుడైనాడు. ఈమాటతో అతనికి వెర్రికోపం కూడా వచ్చింది.

"ఛీ! ఫో నాముందునించి" అని అరిచాడు.

"పోనీ తిండికేనా కొద్దిగా ఇయ్యి."

"ధర్మశాస్త్రం ఎంతవరకూ కంఠోపాఠం చేశావు?"

"వ్రాసినంతమటుకు కాగితాలు పోయినాయి."

"లాటిన్ సారస్వత సంగ్రహం?"

"పుస్తకం ఎవరో దొంగిలించారు."

"తత్వశాస్త్రం?"

"మతాన్ని అధిక్షేపించే తత్వశాస్త్రం నాకు నచ్చదు."

"ఒళ్ళువంచి పనిచెయ్యనివాడికి తిండిలేదు"

జెహాన్ క్షణం ఆలోచించాడు. తరవాత చేతులలో ముఖం కప్పుకుని ఏడుస్తున్నట్లు నటించాడు.

"అదేమిటి? నీ నటన ఇంక చాలించు"

జెహాన్ చేతులు తీసేసి అన్నవంక జాలిగా చూశాడు. "పోనీ నా దుస్తులవంక చూడు. చిరిగిపోడానికి సిద్ధంగా ఉన్నాయి."

"దుస్తులు మంచివి కుట్టిస్తాను, కాని డబ్బివ్వను."

"పోనీ అట్టే అక్కర్లేదు. కొద్దిగానే ఇయ్యి. నువ్వు చదవమన్నవన్నీ చదువుతాను. నేనాకలితో చచ్చిపోతే చూస్తూ ఊరుకుంటావా?"

క్లాడ్ మాట్లాడలేదు. జెహాన్ ఈమాటు తెగించాడు.

"పోనీలే. ఇంక జూదానికే వెడతాను. తాగుతాను."

"జెహాన్! చెడిపోతున్నావు సుమా! చివరికి కొరతెక్కుతావు."

"పోనీ, అదీ మంచిదే."

"చివరికి నీకు ఉరికూడా తప్పదు."

"ఉరి అంటే—ఒక చివరమనిషీ, మరొక చివరలోకం.—మనిషిగా చావడం మేలు."

"నరకం పాలౌతావు."

ఇంతలో ఎవరివో అడుగుల చప్పుడు వినవచ్చింది.

"ఆగు. మాస్టర్ జాక్ వస్తున్నాడు. ఆ కొలిమిచాటుని దాక్కో. ఇక్కడ వినేదీ చూసేదీ ఎవ్వరిదగ్గరా చెప్పకూడదు సుమా!"

జెహాన్ కొలిమిచాటున దాక్కున్నాడు. వెంటనే అతనికొక ఉపాయం తట్టింది. "నేను ఊపిరైనా విడవకుండా నిశ్శబ్దంగా ఉండాలంటే, ఒక్క కాసియ్యి" అన్నాడు.

"అలాగే ఇస్తాను, కూచో."

"ఇప్పుడే ఇవ్వాలి."

"తీసుకో" అంటూ కోపంతో విసిరాడు క్లాడ్. అది అందుకుని కొలిమిచాటున దాగాడు జెహాన్.

కొత్తగావచ్చిన ఆ గంతుకుడు నిలువెల్లా నల్లని దుస్తులు ధరించాడు. జెహాన్ కొలిమిచాటునుండి అతన్ని కనిపెట్టిచూశాడు. అతని వయస్సు 60 దాపులో ఉంటుంది. కనుబొమలు కూడా నెరిసిపోయాయి. పెద్దపెద్ద చేతులున్నాయి. క్లాడ్ ద్వారంవద్ద ఒక ముక్కాలిపీట చూపి కూర్చోమన్నాడు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

"ఏమైంది? నీ ప్రయోగం ఫలించిందా జాక్?"

"వీసంలేదు. ఊది ఊది శోషవచ్చింది. అంతా బూడిదే కాని అణువంత బంగారం రాలేదు."

క్లాడ్ కలవరపడ్డాడు: "అది కాదు నే నడుగుతున్నది. ఆ గారడీవాడిసంగతి. ఏమైనా చెప్పాడా? నేరం ఒప్పుకున్నాడా?"

"లేదండి. చితక పొడిచేశాం, కాని ఒక్కమాట చెప్పలేదు. వాడి కీళ్లన్నీ స్వాధీనం తప్పాయి. అయినా ఇంకా మా ప్రయత్నం మానలేదు. గట్టివాడు. ఆశ్చర్యంగానే ఉంది!"

"వాడి ఇంట్లో ఏం దొరకలేదా?"

"ఇదుగో, ఇదొక పత్రం దొరికింది. ఇందులో ఏదో రాసివుంది కాని మాకు తెలియలేదు."

"ఇలా తే" అని క్లాడ్ పత్రం అందుకుని విప్పిచూశాడు. "పిచ్చికుక్క కరిస్తే చదవవలసిన మంత్రాలివి."

"ఇదుగో ఇంకోటి దొరికింది" అంటూ జాక్ ఒక పాత్ర అందించాడు.

"ఆ! ఇదీ మూస!"

"దీనితోకూడా ప్రయత్నంచేసి చూశానండి. కాని ఏం లాభించలేదు."

"లాభం లేదు. వాడు మోసకారి. వాడు బంగారం తయారు చెయ్యలేడు. జాక్! నువ్వు నగరంలో ఒక అధికారివి. వాణ్ని శిక్షించడం నీవిధి."

"తప్పకుండా. అయితే ఆ జిప్సీని ఎప్పుడు పట్టుకోమంటారో చెప్పండి. మరిచిపోయాను."

"జిప్సీ ఎవరు?"

"రోజూ పారిస్‌లో నృత్యంచేస్తూ వీధుల్లో తిరుగుతుంది. కూడా ఒక మేక ఉంటుంది. అది మంత్రకత్తె అని నిరూపించడానికి సాక్ష్యం సేకరిస్తున్నాం. కాని అంత చక్కనిదాన్నింత వరకూ నాకళ్ళతో చూడలేదండి. ఎప్పుడు పట్టుకోమంటారు?"

క్లాడ్ ముఖం పాలిపోయింది. "సమయం వచ్చినప్పుడు చెప్తాను. ఇప్పుడు కాదు."

క్లాడ్ చూపులు కొలిమిప్రక్క సాలెగూడుపై ఉన్నట్లు జాక్ గమనించాడు. జాక్ అటువంక చూశాడు. అప్పుడే ఒక ఈగ సాలెగూడులో చిక్కుకుంది. గూడు కదలగానే పెద్ద సాలెపురుగు మేలుకుంది. ఒక్కదుముకుతో ఈగపైబడింది. తొండంతో తల పొడుస్తూ, ముందు రెండు కాళ్ల మధ్య తన దారంతో చుట్టివెయ్యడం మొదలుపెట్టింది. జాక్ ఇది చూసి ఒక్క ఉదుటున లేచాడు. సాలెగూడువైపు చెయ్యి చాపాడు.

"ఆగు జాక్! ఆగు! విధివిహితమైనదానికి అడ్డుపడకు" అన్నాడు క్లాడ్. జాక్ తెల్లబోయి మతాధికారివంక చూశాడు. క్లాడ్ దృష్టి సాలెగూడుపై కేంద్రీకరించాడు.

"ప్రస్తుత పరిస్థితి కిది సంకేతమనిపిస్తోంది. ఉల్లాసంతో ఎగిరెగిరి గాలి వెలుగులకోసం వెతికివచ్చింది ఈగ. స్వేచ్ఛకోసం వచ్చి ఈ మృత్యుగహ్వరంలో చిక్కుకుంది. పాపం! ఏమరాల్దా! విధికి అడ్డుపడకూడదు జాక్! సాలెపురుగు నేంచెయ్యకు, వొదిలిపెట్టు."

"అది పోనివ్వండి. బంగారం తయారుచెయ్యడానికి మీ సహాయం కావాలి, నా ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి."

ఇంతలో కొలిమి ప్రక్క సద్దువినవచ్చింది. "అదేమిటి?" అన్నాడు జాక్ భయంతో.

"ఏమీలేదు. పిల్లి. మనం కిందిగదిలోకి వెళ్ళి అక్కడ గ్రంథం చూద్దాం. నడవండి" అంటూ క్లాడ్ లేచాడు. ఇద్దరూ మెట్లు దిగి వెళ్ళారు. వెళ్ళగానే జెహాన్ కొలిమి చాటునుంచి ఇవతలకి వచ్చి దుస్తులు దులుపుకున్నాడు, "అబ్బ! పీడ విరగడైంది" అంటూనే తుమ్ములారంభించాడు. "పిచ్చికుక్కలు. ఇంక



# ఘంటారావం



చాలు" అంటూ గదినుంచి వెలువడ్డాడు. ఒకసారి ద్వారంవంక చూసి తలుపులు వెయ్యకుండా అలాగే ఉంచి "అంతే కావాలి, శాస్తి"అనుకున్నాడు. ఈలపాట పాడుకుంటూ వీధిలోకి వచ్చాడు. చర్చిముందు ద్వారంవద్ద క్లాడ్ తన మిత్రునితో కలిసి ఒక శిల్పం పరిశీలిస్తున్నాడు. జెహాన ఒకసారి వారివంక నిర్లక్ష్యంగా చూసి రెండడుగులు వేశాడు. వెనుకనుంచి పిలుపు వినవచ్చింది; చూశాడు. "అరె! ఫీబస్" అన్నాడు.

"జెహాన్! ఉండు" అన్నాడు ఫీబస్.

ఫీబస్ పేరు వినేసరికి క్లాడ్ తలతిప్పి చూశాడు. ఫీబస్ వంక తదేకదృష్టితో కొంతసేపు చూశాడు.

"జెహాన! ఎక్కడికి?"

జెహాన్ ఈలవేశాడు. దాని అర్థం ఫీబస్ కి తెలుసు.

"నా జేబు ఖాళీ" అన్నాడు ఫీబస్.

"నా దగ్గరుందిలే" అన్నాడు జెహాన్.

క్లాడ్ కొంచెం ముందుకువచ్చి ఫీబస్ ని పరికించి చూశాడు.

"నమ్మకంలేదు" అన్నాడు ఫీబస్. "నీ జేబులో డబ్బుంటే, నీటితొట్టిలో చంద్రుడున్నమాట. నీ జేబులో డబ్బుండదు; గులకరాళ్ళుంటాయి. పందెం వేస్తాను."

జెహాన్ జేబులోనుంచి కాసుతీసి చూపించాడు.

"అరె! కాసు! కళ్లు చెదిరిపోతున్నాయి" అన్నాడు ఫీబస్. "ఎవరిజేబు కత్తిరించావు రాత్రి?"

జెహాన తలెగరవేశాడు. "అన్న మూర్ఖుడు కావడం అదృష్టమంటే" అన్నాడు.

"పదు. పొట్టపట్టినంత తాగాలివాళ" అని దారితీశాడు ఫీబస్.

క్లాడ్ కి ఈమాటలు వినపడుతూనే ఉన్నాయి. అతన్ని యువకులిద్దరూ గమనించలేదు. క్లాడ్ కొద్దిదూరంలో ఆ యిద్దరినీ అనుసరించాడు.

వీధిమలుపు తిరిగేచోట తంబుర వినపడింది.

"పదు! గబగబా పదు!" అని ఫీబస్ తొందరపెట్టాడు.

"ఎందుకు?" అన్నాడు జెహాన్.

"ఆమె చూడకుండా తప్పించుకోవాలి!"

"ఎవరు?"

"జిప్సీ. మేకని వెంటబెట్టుకు తిరుగుతుంది, ఆమె."

"ఎస్మరాల్డాయేనా?"

"అవునవును, ఎప్పుడూ ఆమె పేరు మర్చిపోతూనే ఉంటాను వీధిలో ఆమెతో మాట్లాడ్డం మంచిదికాదు."

"ఆమె నీకు బాగా తెలుసా?"

క్లాడ్ అతని ముఖవైఖరి గమనించాడు. ఫీబస్ చిరునవ్వు నవ్వుతూ జెహాన్ చెవిలో ఏదో ఊదాడు. ఊది పకపక నవ్వడం మొదలుపెట్టాడు.

"నిజం?" అన్నాడు జెహాన్.

"నిజం!"

"ఈరాత్రే?"

"ఈ రాత్రే."

"ఆమె వస్తుందని నీకు నమ్మకమే?"

"తప్పకుండా వస్తుంది."

"కెప్టెన్ ఫీబస్! నీ అంతటి అదృష్టవంతుడు పారిస్ లో లేడోయ్."

క్లాడ్ ప్రక్కగా ఈ సంభాషణలో ప్రతిఒక్క మాటా శ్రద్ధగా విన్నాడు. పళ్ళు పటపట కొరికాడు. అతని శరీరమంతా కంపించిపోయింది. ఒళ్లు తిరిగినట్లయింది. ఒకచోట ఒక స్తంభానికి చేరబడి నిలబడ్డాడు. కొంతసేపటిలో తేరుకుని మళ్ళీ యువకులిద్దరినీ అనుసరించాడు.

(ఇంకావుంది)



# అంతరంగంలో తరంగాలు



(16-వ పేజీ తరువాయి)

చెయ్యి నిమురుతూ అన్నాడు. "నీ ఒంట్లో బాగులేదా?"

ఇప్పటికి మోసు తెలిసిందనుకుంది ఆమె. నిట్టూర్పు విడుస్తూ "బాగులేకేం?" ప్రశ్నలాటి జవాబు.

నిజంగా తన గుండె బండబారిందంటే, ఆమే కారణం అనుకున్నాడు రామం.

"సరేలే. రేపు డాక్టర్ని తీసుకొస్తాను."

"డాక్టరు కుదిర్చే జబ్బులాంటిదికాదిది" అంటూ ఒక్కమాటు భళ్లున యేడిచింది. రామం ఒళ్లు ఝల్లుమంది. ఏందుకో అనుకోకుండా తనకీ కళ్లల్లో నీళ్ళు తిరిగేయి. మాట్లాడలేకపోయేడు రామం. భర్త వైఖరి స్పష్టమయిందనుకుంది.

"కపటిమా మేమిటి?" యిదే ప్రశ్న ఆమె కన్నీటి కాలవల్లో కెరటాలుగా ప్రవహించింది. అతనుమాత్రం అలాగే ఊరుకున్నాడు. తన గతి అర్థమయిందనుకుంది. భర్త చేసిన మోసానికి యెంత పాతకమైనా చుట్టుకుంటుంది.

ఆమె కంటిలో తడి యింకుతోంది. తలపోటు అధికంగా ఉంది. శిరస్సు తాపానికి పగిలిపోతోంది. తానిలా యెంతకాలం బ్రతకటం?

ఇంతలో పిల్ల కెవ్వుమంది. నిద్రలో భయం వేసిందికామోలు. మొదట్లో అలాగే ఊరుకుంది తల్లి. పిల్ల గుక్క పెట్టింది. ప్రక్కకు ఒత్తిగిలి పిల్లను తీసుకుంది. భర్త తలవాలిపడి ఉన్నట్టయింది. పోనీ తనకా వ్రాసిందు కనిపించింది. గుండె బరువెక్కుతోంది. దుఃఖంతో నిండిన మనసు భయంతో తూగలేకపోయింది. బాధతో భర్త తలయెత్తి చూసింది. అతనికి స్పృహ లేదు. ఆమెకు కరచరణాలు స్తంభించిపోయేయ్. పిల్ల కెవ్వుమంది. పాడుపిల్ల అనుకుంది. భర్త మొహంమీద నీళ్ళు జల్లింది. మొహం మరుగుతోంది కళ్లు బలవంతంగా విప్పింది, కాని మూతలు పడ్డాయి.

నీళ్ళు గట్టిగా జల్లింది. పిల్లమీదకు తుళ్లేయ్. పిల్ల మరింత గుక్కపెట్టింది. కాని తల్లి వినిపించుకోలేదు.

నోరు విప్పి నీరు పోసింది. రామం నోరు విడలేదు.

తిరిగి నీరు పోసింది. రామం గుక్క వేసేడు. కొంచెం నీరు దిగింది. ఆత్రుతగా నుదుటిమీద చెయ్యి నిమురుతూ విడుతున్న కళ్లల్లోకి చూసింది. భూతకాలపు లోతుల్లో తమ ప్రేమగాథలు గోచరించేయి.

రామం కళ్ళు విప్పేడు. భార్య మొహంలో భావిసౌఖ్యానికి హామీ కనపడింది.

నుదిటిమీద చెయ్యి తీసి గుండెమీద అన్చుకుంటూ 'నన్నెప్పుడూ అపార్థం చేసుకోకు' అన్నాడు.

తన నేరం గ్రహించి తన చూపులన్నీ నేలకు నాటింది ఆమె.

రామం లేవబోయేడు. చిటిపాప యేడుపు మాని కేరింతలు పెట్టింది.

## ★ ఏరులూ - వారసులూ ★

(21-వ పేజీ తరువాయి)

న్నంతా వూడదీసి, ఏకొయ్యకాకొయ్యను క్రమక్రమంగా, నీటుగా కత్తితో పగల గొట్టుతున్నాడు. స్వేదంతో అతని వళ్లంతా తడిసిపోయింది. తలగూడా చన్నీళ్లస్నానం చేసివచ్చినట్లుగా వుంది. వంటిమీద అంగవస్త్రం ముక్కే వున్నది. ఈ దృశ్యం చూడగానే మొదట నిశ్చేష్టురాలైనది. ఒక వేళ కోటిలింగం పిచ్చివాడు కాలేదుగదా అని భయంకరమైనయోచన వచ్చిందామెకు.

కోటిలింగం ఆమెవంక కన్నెత్తి గూడా చూడలేదు. అతని చూపు, మనస్సు ఆ విధ్వంసక క్రియలో లగ్నమైవున్నట్లు తోచినది. తాయారమ్మ భయాందోళనలు కోపజ్వాలలై రగుల్కొన్నవి.

"నీకేం పోగాలం వచ్చింది? పిల్లల నోటి ముందు తిండి తీస్తున్నావ్" అని పెద్దగా అరిచింది.

కోటిలింగం తల పైకెత్తి ఆమెవంక నిదానంగా చూసి—"నీకు తెలీదు గామోలు. తాత తాంబుర పగిలిపోయింది. ఈమగ్గంతో నాకు పనిలేదింక" అని బహు నెమ్మదిగా సమాధానం చెప్పాడు.

తాయారమ్మ రెచ్చిపోయింది.

"నీకు మతిపోయింది. మమ్మల్ని చంపి పారేయక పొయ్యావా గొంతులు పిసికి? ఈ అఘాయిత్యం ఎవరు చెప్పారు నీకు? ఆ ముసలి బైరాగి ముండాకొడుకుతో దిరిగి కొంప గోడు మర్చి యింటికి చేటు దెస్తావా?"

అప్పటికే మగ్గం నామరూపాలు లేకుండా పోయింది. అతను మాట్లాడకుండా మొద్దుకత్తిని ఆ శిథిలాలమీద పారేసి అపర శివుడు లయనృత్య వేదికనుండి తొలగినట్లు తొలగిపోయాడు వరండాలోకి. ఆ గొడవకు పిల్లలంతా లేచి గోల్లుమన్నారు. తాయారు పసికందుల్ని దగ్గరకు చేర్చుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

* * *

కోటిలింగం మొట్టమొదటిసారిగా వ్యవసాయ కూలీ - అయినాడు అతని అజీవితంలో. ఉయ్యాల లూగించిన చెయ్యి స్మశానవాటికలో గోరీలు త్రవ్వబోయింది. పూలుబెంచిన హస్తాలతో గులకరాళ్ళెత్తాలి అనుకొంటూనే మొదటిసారి జనుము కోతల కెళ్ళాడు. ఈ కాయకష్టంలో నీచత్వం వున్నదని అతనికి మొదటినుంచీ తోచింది. తన తోటవాళ్ళతో తానెందుకు కలియలేదో అతనికే తెలియదు. మగ్గం నాశనం చేసిననాటినుండీ అతను యితరుల జోక్యమే మానుకొన్నాడు. మానవులంటేనే అతని శరీరం ముడుచుకొనేది. ఒక్క శ్రీరాములుగారు తప్ప తాయారమ్మన్నా, తన బిడ్డలన్నాగూడా అతనికొ అసహ్యభావమే స్ఫురిస్తున్నది.

చేతులు తెగుతూ, శాలిక పీకుతూ, శిరస్సుమండుతూ-వేడెక్కిన కొడవలితో, కింద మేకులవంటి మోళ్ళు కాళ్ళకు గుచ్చుకొంటూండగా జనుము కొయ్యటం తేలిక పనిగాదనీ, దీనికీ సుళువు తెలియాలనీ, తెలివిఉండాలనీ, యీ కష్టం ఎంత తక్కువదైనదని తను అనుకొన్నాదాని సుళువు బలువులు ఎరగాలనీ అతను గ్రహించటానికి ఎంతోసేపు పట్టలేదు. తనతోటి కూలీలంతా పదిబారల ముందుండగా తనింకా వెనకనే తచ్చాడుతూ, బొబ్బలు పొక్కిన చేతులలో కొడవలి మార్చుకుంటూ గట్టుమీద కూర్చొని చుట్ట కాల్చుతున్న రాయుడమ్మ రైతుచేత క్షణక్షణం చీవాట్లు తింటున్నాడు కోటిలింగం. రైతు సుల్తాన్ - "తేరగా కబుర్లు జెప్పట మనుకొంటివిటోయ్ సాలాయనా. నడుం వంచు, అడ్డెడు గింజలు వుత్తి పుణ్యానికి రావు. అంత వళ్లుగందేవాడివి కూలి కెందుకొచ్చా? బట్టలు నేసుకోపోయినా?" అని రెట్టిస్తునే చుట్ట కాల్చివేశాడు. పక్కన నోరులేని బ్రాహ్మల పొలాలగట్లు గదుముకొని, అడ్డం వచ్చిన మాలపకీరుమీద దొంగ కేసు బనాయించి జైల్లోతోసి, మునసబును కూడగట్టుకొని మొత్తానికి ఆ పొలమంతా పాగాకు - పార ధరకు తను కట్టుకొని- రాయుడమ్మ ఆ గట్టుమీదినుంచి ఈ గట్టుదాకా దృష్టి సారించి తృప్తిపొంది వూరుకో లేదు. చుట్టపీక అవల పారేసి, చేలోకి దూకి, కోటిలింగం చేతిలో కొడవలి లంకించుకొని, అతన్ని మెడమీద చెయ్యి వేసి గెంటి - "వట్టి ముదనష్టం బాపతు. పో, పో, నీకు మద్దెనాల తిండి పోయటం గూడా శుద్ధ దండగ్గింది. ఎవర్రా అంకొ, వీడ్ని పిలుచుకొచ్చింది?" అని తన జీతగాడిమీద తిరిగినాడు.

కోటిలింగం ధాన్యపు సుల్తాన్‌తో కలియబడబోయినాడు. మిగతా కూలీలు అడ్డువచ్చి అతన్ని మెల్లగా పంపివేశారు. 100 నెంబరు నేసినహస్తాలు! పొప్లయిన్లు చూసి తిరిగి మగ్గంమీద నేసిన హస్తాలు! వంకర పూజల చిలక జరీగళ్ల చీరెలు మురిపెంగా తన యింటినుండి అమ్మకం చేసిన హస్తాలు. ఆ హస్తాలు దేనికి - యీ నవాబుకు? ఆ హస్తాలు విరిగిపోయినాయ్. ఆ మగ్గమూ మాయమైనది. (ఇంకా వుంది)

## ★ ఓడలు - బళ్లు ★

(23 వ పేజీ తరువాయి)

మనిషి, మాణిక్యం మాణిక్యంగాక మసిబొగ్గలాగొతుంది?"

"ఏమి బంధుప్రేమ! ఏమి ఆదరణ!!" అని ముక్కుమీద వేలేసుకున్నారు రామశాస్త్రిగారు.

"ఆవిడ కేవలం సుగుణాలరాసి అంటే నమ్మ..."

"ఆవిడచేతి కెక్కడా ఎముక లేదుగదా! గుప్తదాత."

"సాక్షాత్తు అన్నపూర్ణాదేవి."

"బ్రాహ్మణులందరికీ కాసుకాసులేగా పంచిపెడత! ప్రతి బ్రాహ్మణుడికీ తలోకాసు, జామారు, పనసపండు, గుమ్మడికాయ, గంధపుచెక్కకి తక్కువలేకుండా ఇచ్చారా పుణ్యదంపతులు... ఈ పదహారు రోజులు ఎవరింట్లోనూ పొయ్యిలో నిప్పెసుకో లేదుగదా!"

"అంతేనా! ఘనాపాఠీలందరికి శాలువలు కప్పి నూటపదహార్లిచ్చారు."

"ముష్టివాళ్ళందరికీ ముంతలకి ముంతలే అందించేశారు. వాళ్ళకికూడా వస్త్రదానం చేశారు."

"ఏజన్మలోనో ఇంత ఆచేతా ఈచేతా పడేసుకున్నారు. ఈజన్మలో అనుభవిస్తున్నారు."

"ఈ జన్మలోను ఇంత చూసీ చూడక ఎడంచేత్తోటీ కుడిచేత్తోటీ పడేసుకుంటున్నారు! మళ్ళీజన్మలో ఏమైపడతారో!"

"కేవలం దేవతాస్వరూపులు, వాళ్ళకి ఇంకా మళ్ళీ వేరే జన్మంటూ ఉంటుందాంట! ఏదో శాపవశాత్తు యిలా జన్మించి ఉంటారు!"

"ఇంత ఉండగానే సరిటయ్యా! దానగుణంగూడా ఉండాలి..."

"మరే మొన్న జిల్లాజడ్జీగారమ్మాయి పెళ్ళి చూశారా! 25 వేలు కట్నం క్రిందిచ్చి అల్లుణ్ణి అమెరికా పంపుతాడుట చదువుకి. అందుకని పిల్లికి భిక్షం పెట్టలేదు సరికదా! గ్రామఫోన్ రికార్డుపెట్టి డుండుం లాడించేశాడా పెళ్ళి కొస్తాను. ఒకముద్దా ముచ్చటా?"

"అయ్యయ్యో! ఆవేళ పెళ్ళినాడు ఒక బీదబ్రాహ్మణుడు జడ్జీగారింటికి పిలవని పేరంటం చేశాడుట. విస్తరిముందు కూర్చున్న విప్రుణ్ణి మెడపట్టుకు గెంటాడుట మూడుర్ఘాముల వేళ........వినాశకాలే విపరీతబుద్ధిః"

"ఇలాంటివాళ్ళుండబట్టే కాలం యిలా కాలిపోతూంది."

"కట్నమిచ్చి కన్యాదానం చేసి చేతులు

★ [illegible] ★

దులు పుకు కూర్చున్నారు బాపిరాజుగారు. బాకీలన్నీ వసూలైయ్యాయి. బ్యాంకిలన్నీ ఖాళీలయ్యాయి. నిలవ సొత్తంతా నిర్మూలమైంది. కట్టుకున్న భార్య, కోరుకున్న ఇల్లు, చేస్తూన్న ఉద్యోగం, తనూ తప్ప అగ్గవంతా అంతమైంది. కానీ అన్నం తినడం మాత్రం తెగుగంటలేదు. అంతా ఆప్త బంధువులే. ఎవర్ని కాదంటారు? బాపిరాజుగారి ఆర్జన అడుగంటినా, మాణిక్యమ్మగారి సత్తువ సన్నగిల్లినా చుట్టాలుమాత్రం చూరట్టుకు వేళ్ళాడ్డం మానలేదు. అక్కరకు రాని చుట్టాలంతా అరుగులకి అతుక్కుపోయారు.

సందిటంతా సర్దు మణిగింది. ఏకైక పుత్రికను ఎప్పుడో అత్తారింటికి పంపించాడు. బాపిరాజుగారు స్వయంకృషివల్లే చదువుకుని సముద్రం కొంగలిగాడు. అందులోను లేక లేక తపించగా వార్ధక్యం సమీపించే దశలో కలిగిన సంతానం చిట్టి. చిట్టి పుట్టినప్పటినుంచి బాపిరాజుగారి భాగ్యం అందుకుంది. కానీ భాగ్యాన్ని భద్రపరచాలన్న బుద్ధి లేకపోయింది. ఆడదానికి మించిన ఖర్చు చేసి అప్పులపాలయ్యారు. అమ్మాయి పెళ్ళితోటే భాగ్యమంతా తరిగిపోయింది. అమ్మాయితోటే అత్తారింటికి అంగలేసింది భాగ్యం.

బాపిరాజుగారు, మాణిక్యమ్మ అమ్మాయిని అత్తారింటికి సంపేసి దుఃఖంచేత దూర ప్రయాణం సాగించారు. ఇల్లు తాకట్టు పెట్టి యాత్రలకి బయలుదేరారు. చుట్టాలంతా చురచురలాడారు. మూడు నెలలు యథేచ్ఛగా యాత్రలు సేవించి ఇల్లు చేరుకున్నారు. నోములు, వ్రతాలు, దానాలు ధర్మాలు, పూజలు పునస్కారాలు, సప్తాహాలు, భజనలు, సంతర్పణలు సమారాధనలు వెనకాముందూ చూడకుండా వెచ్చించివేశారు.

ఇన్నాళ్ళనుంచీ వడ్డీ ప్రాక్టీసు తగ్గించుకున్నారు. ప్రాక్టీసు తగ్గగానే పైసలు శూన్యమయ్యాయి. పైసలు తగ్గగానే అప్పులబాధ అధికమైంది. బంగారం అమ్మేసి అప్పుల బాధ బాపుకున్నారు. పువ్వులమ్మిన ఊళ్ళో కట్టెలమ్మడం ఇష్టంలేక స్వగ్రామం చేరారు. చిన్నం కొదరం మిగిలితే అమ్మి పర్ణకుటీరం నిర్మించుకుని వానప్రస్థాశ్రమం పుచ్చుకున్నారు, పురాణకాలక్షేపం చేసుకుంటూ, నిర్మలమైన ప్రదేశంలో నిశ్చింతగా. వియ్యాలవారు తహతు లేని సంబంధం చేసుకున్నామని తప్పపడి పిల్లని పుట్టింటికి సంపడం మానేశారు. బాపిరాజుగారు జీవసమాధిలో నుండి చింతించేవారు కారు. కానీ మాణిక్యమ్మగారు మాత్రం కన్నకడుపు కొబట్టి అప్పుడప్పుడు కళ్ళు నీరు పెట్టుకునేవారు.

బాపిరాజుగారికి అవసానకాలం ఆసన్నమవడంవల్ల పక్షవాతం వచ్చి మంచాన బడ్డారు. పాపం మందు తెచ్చే దిక్కుకూడా లేకపోయింది. పల్లెటూరవడంచేత, అంగబలం అందుబాటులో లేకపోవడంచేత, చాలినంత ధనం దాచకపోవడంచేత, వైద్య సహాయానికీ మందులికీ కరువైపోయింది. కడుపున కలిగిన కన్నబిడ్డకూడా కళ్ళ మూపులకి కరువైపోయింది. పండిపోయిన పండు రాలిపోయింది. బాపిరాజుగారు కళ్ళు మూయగానే చంచుల్లా చూరట్టుకు వేళ్ళాడిన చుట్టాలంతా చూపులకైనా కనబడలేదు. స్నేహితులంతా సన్నగిల్లారు. కష్టాలు పరంపరలన్నట్లు; వార్ధక్యం దారిద్ర్యం. బంధువులంతా తప్పుకున్నారు. మాణిక్యమ్మగారు మనోవ్యాధితో క్రుంగిపోయింది. బంధువులంతా బం[illegible]ళ్ళయ్యారు. చుట్టాలంతా దొంగలయ్యారు. దేవుళ్ళంతా దెయ్యాలయ్యారు.

వియ్యాలవారికి ఎన్ని కబుర్లుపంపినా వారి పత్తాలేదు. పంతులుమాత్రం ప్రమాదవశాత్తు పరుగెత్తుకొచ్చాడు, పరమాన్నం జుర్రుకుందామని. పదిరోజులు కానిచ్చి పిన్నమ్మ నోదార్చాడు. ఉన్న పుస్తె పూస హుళక్కి చేసి కర్మకాండ కానిచ్చాడు. జిగినీ గొలుసు జీర్ణమైపోయింది. ఆ పైపంక్క కోసగం అలమటించి పోయాడు. ఉన్నదంతా హుళక్కైందని తెలిసి అప్పులు చేసేశాడు. ఉన్న కాస్త యిల్లు అమ్మేసి అప్పులు తీర్చేసి మిగిలినంత చేజిక్కించుకుని పరారయ్యాడు. జిగినీ గొలుసు తీసికెళ్ళి జీవనాధారం చేసుకుని మేడలు కట్టుకున్న పంతులుకి పిన్ని పీనుగైంది. నిరాధారంగా నిలబడ్డ ఆమె దీనస్థితి చూచి బూరెలుతిన్న పురజనులంతా బుగ్గలు నొక్కుకున్నారు. వార్ధక్యంలో వైధవ్యం వెంటాడినందుకు, దానికితోడు దారిద్ర్యం ఆవిణ్ణి వహింపచేస్తూంది. ఊరివారు ఉద్ధరిస్తారా? ఆత్మబంధువులు ఆదరిస్తారా? కన్న కూతురుకోసరం కలవరించి పోయింది. వృద్ధాప్యంవల్ల కళ్ళు మసకలు క్రమ్మాయి.

వియ్యాలవారి ఊరు బయలుదేరింది. ఇంటికి తాళం. నీరసంతో నిలువునా నీరై పోయింది. నడుం విరిగిపోయినట్లైంది. ఊరంతా కలియదీసింది. అల్లుడు అమెరికా వెళ్ళాడని కూతురుకి పురిటిరోజులని వియ్యాలారంతా ఢిల్లీలో పెద్దబ్బాయిగారింట్లోనే మకాం పెట్టేశారనీ తెలిసింది. వార్ధక్యం వెంటాడినా, వయస్సు మళ్ళినా, కష్టాలు కలవరపరచినా కడుపుమాత్రం కట్టుకోలేక పోయింది. కర్తవ్యం కనబడలేదు. ఒక గొప్ప ప్లీడరుగారింట్లో వంటకి కుదిరింది. అమ్మాయి వివాహానికి నెలలతరబడి మేసిన మేధావులంతా ఆవిణ్ణిచూసి బుగ్గలు నొక్కుకున్నారు. సాయంకాలం కాలవగట్టుమీద విచారణ సాగించారు.

"ఎలాంటివాళ్ళకెలాంటి గతి పట్టిందో చూశావా? కాలవశాన్ని బళ్ళోడలు ఓడలు బళ్ళూ అవుతూంటాయి సుమా!"

"కాకపోతే! కలిమేమి ఎలకాలము కులగిరులా, కదలకుండా? ఎల్లకాలం ఒక్కలాగే ఉట్టికట్టుకు ఊరేగుతారటోయ్!"

"ఊరేగడం కాదు గానీ! మాణిక్యమ్మగారు ప్లీడరుగారింట్లో వంటకి కుదిరిందిట!"

"ఆ! ఏమి టేమిటి!! మాణిక్యమ్మగారే!"

"అయినా అంత విరగబాటా!"

"అయినా తనకు మించిన ధర్మమేమిటి చెప్పూ! ఆ కూతుర్ని వాళ్ళు పంపడం మానేశారుట గా!"

"ఆఁ! ఈ ఇసేటంతా ఊరికే పోతుందనా! వచ్చేం జెయ్యాలి? వాళ్ళకి అప్రతిష్ఠ కాదూ! జమీందారులాయె!"

"మహా బాగా అయిందిలే! తగిన శాస్తి జరిగింది. లేకపోతే ఆవేళ వెధవను పెళ్ళాడిన శంకరయ్య కొడుకు ఛస్తే తినేందుకు వెత్తనం పెండులు చెయ్యాలా? బ్రాహ్మలంతా వలివేస్తే తను ఉబ్బెట్టి... పూటకి గతిలేని ఎద్దికి సహాయపడతాడా? ఆవేళ అందరి నోళ్ళూ డబ్బు పెట్టి కట్టగలిగాడు. కానీ... ఇప్పుడేం చేస్తాడు?"

"తను పర్వత కుంటెటికి మూడేకాళ్ళనే వాడు. ఉత్త మొండిమనిషి. పేరయ్య కూతురు పెళ్ళికి కట్నం సర్దుబాటు కాకపోతే వెయ్యినూటపదహార్లు అర్పించుకున్నాడు."

"ఓ తమాషాయో, ఒక నోటూ, ఒక తాకట్టూ... అంతా ఎరగంటారుగదా! బుద్ధిః కర్మానుసారిణీ అని, అవిసె వ్రాలి ఇలాగుంటే ఎవరు తప్పించగలరు?"

ప్లీడరుగారు కుటుంబంతో సహా యాత్రలకి బయలుదేరారు. మాణిక్యమ్మగారు కూడా ఢిల్లీలో కూతుర్ని చూడాలన్న ఉద్దేశంతో కుతూహలపడింది. కానీ కాశీ చేరే లోపలే కన్ను తెరవకుండా జ్వరం వచ్చింది. కాశీ చేరగానే కూతుర్ని స్మరించుకుంటూ తుది నిద్రలో లీనమైపోయింది.



Edited Printed & [illegible] by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras



పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి







































